కీ॥శే॥ రావూరి శివయ్య (సాంబశివరావు) గారి
2వ వర్ధంతి సందర్భముగా

# భావజాల సాధాలు

కొన్ని మానవీయ సంస్థల పరిచయాలు

















ప్రచురణ
ప్రజా విజ్ఞాన చైతన్య వేదిక - తెనాలి

# భావజాల సౌధాలు

(కొన్ని మానవీయ సంస్థల పరిచయాలు)

## గౌరవ్

ప్రచురణ

**ప్రజా విజ్ఞాన చైతన్య వేదిక**

ముద్రణ సందర్భం

**ప్రజా ఉద్యమాల కార్యాలయం ప్రారంభం**

ఆగష్టు 15, 2024

**మూల్యం - అమూల్యం**



**విజ్ఞప్తి**

ఇందులోని వ్యాసాలన్నీ సామాజిక మాధ్యమాల కోసం ఆయా సందర్భాలలో రాసినవి మాత్రమే. రచయిత, ప్రచురణకర్తలు ఇందులోని భావాలు అన్నిటితోనూ తప్పనిసరిగా ఏకీభవించాల్సిన అవసరం లేదు.

ప్రాప్తి స్థానం

**ఆర్. శివకృష్ణ, తెనాలి**

సెల్ : 99664 44600

# సహృదయ ప్రేరకాలు – మానవతా వాహకాలు

అకస్మాత్తుగా ఓ రోజు మిత్రుడు శివకృష్ణ తెనాలి నుంచి ఫోన్ చేసి ఆగష్టులో నిర్వహించబోయే ఒక బృహత్ కార్యక్రమం కోసం సామాజిక కార్యకర్తలు, ప్రజాపక్ష ఆలోచనా పరులకు ఉపయోగపడేలా ప్రచురించేందుకు చిన్న పుస్తకం సిద్ధం చేయమని అడిగారు. నిజానికి అప్పటికి నా వద్ద ఏ ప్రాజెక్టు రెడీగా లేదు కానైతే హఠాత్తుగా వచ్చిన ఆలోచనను తనతోపాటు మిత్రులు బి. సుధాకర్ గారికి కూడా వెంటనే చెప్పి సూచనలు అడిగాను. ఫలితమే ఇదిగో ఇదిలా మీ చేతికి వచ్చింది.

నేను వెళ్ళిన కొన్ని సంస్థల చిరు పరిచయం ఈ పుస్తకం. తెలుగు రాష్ట్రాల్లో నాకు తెలిసిన ప్రత్యామ్నాయ భావజాల ధోరణికి చెందిన వేదికల్ని కూడా ఇందులో కలిపాను. ఆధ్యాత్మిక తాత్విక చింతనకు సబంధించిన ఏదో మేరకు సామాజిక స్పృహను మిళితం చేసినవే అన్నీ. కానయితే వీటి కోసం రాస్తున్న క్రమంలో ఒక పద్ధతిని ప్రత్యేకంగా పాటించింది లేదు. సామాజిక మాధ్యమాలలో సంక్షిప్తంగా ఉటంకించడం కోసం ఉద్దేశించినవే కాని వరుసక్రమం ఏదీ నేను అనుసరించలేదు.

గతంలో ప్రత్యేకంగా నేను కలిసి పనిచేసిన రెండు ఆశ్రమాలు మైత్రేయి బుద్ధ విహార (వేమగిరి, రాజమహేంద్రవరం) శాస్త్రీయ ఆలోచనలు పెంపొందించు దాతృత్వ సంస్థ (బెల్గాం, పార్వతీపురం) వంటి వాటిని ఇందులో చేర్చలేదు. అలాగే గోరా గారి నాస్తిక కేంద్రం, మాల్లాది సుబ్బమ్మ స్మృతి చిహ్నం హ్యూమనిస్ట్ సెంటర్ (హైదరాబాద్), రావిపూడి వెంకటాద్రి కవిరాజాశ్రమం, రాడికల్ హ్యూమనిష్ట్ సెంటర్ (ఇంకొల్లు) లు కూడా ఇందులో లేవు. ఇంకా దీంట్లో లేని సంస్థలు చాలానే ఉండవచ్చు. వ్యక్తిగతంగా నా పరిమితులే కానీ ఇందుకు మరే ప్రత్యేక కారణం లేదు.

భక్తిని, భావజాలాన్ని వ్యాపారం చేసిన ఆశ్రమాలనబడే బడా కంపెనీల పట్ల నాకున్న అభిప్రాయం వేరు. వ్యక్తిగతంగా పిఠాపురంలో ఇలాంటి రెండు ఆశ్రమాలు, తెలుగు రాష్ట్రాల్లో అనేక సంస్థల ఆగడాల్ని బయట పెట్టి వాటితో దశాబ్దాలపాటు పోరాడి పరాభవాలు కూడా చవిచూసిన వాడ్ని. ఈ దేశంలో ఆశ్రమాలు ఒకప్పుడు నిర్వహించిన మానవతావాద పాత్రని అధ్యయనం చేయడం అవసరమని నా భావన. అలాగే సైన్సు సామాజిక ఉద్యమాల పట్ల కూడా అదే భావన నెలకొంది. అందుకే సగటు మనిషిపక్షం వహించే శ్రేణులకి మద్దతుగా పయనాన్ని మల్చుకున్నాను.

మనిషిది విశిష్ట మధ్యేమార్గం, నిర్మాణాత్మక మానవతావాదం, వినూత్న సమసమాజ స్వప్నం. మానవాళి హితాన్ని కోరే అభిమతం. వ్యవస్థ ప్రక్షాళన కోసం చేసే నిత్య వ్యాయామం, ప్రజాతంత్ర కూటమి కోసం సమిష్టిగా జరిపే పలు విభిన్నతల సామరస్య సంధానం. ఏతరానికాతరం ఆ ప్రయత్నానికి తన వంతు సంభావ్యతల్ని చేర్చి సఖ్యతగా రాబోయే తరాలకు అందించగలగడమే అత్యున్నత విజ్ఞాతగల ప్రతీ తరం పాటించాల్సిన కనీస నైతికత.

టి.యస్.అనంతు అని ఇంజనీర్ స్టాన్‌ఫోర్డ్‌లో చదివొచ్చి ఏవో ఉద్యోగాలు చేసాక జె.పి. ఉద్యమంలో పనిచేసారు. గుజరాత్‌లోని 'సంపూర్ణ క్రాంతి' విద్యాలయం ద్వారా ప్రభావితం అయ్యారు. మొదట్నుంటి సామాజిక స్పృహ కలిగినాయన తమిళనాడు, కర్నాటక సరిహద్దులలో కొంతమంది మిత్రులతో కలిసి 'నవదర్శనం' అనే ఆశ్రమం స్థాపించారు. చాలాకాలం మానవీయ ప్రత్యామ్నాయ జీవన మార్గాన్వేషిగా మసిలారు. మహాత్మాగాంధీ 'హింద్ స్వరాజ్' గురించి ఆయన రాసిన వ్యాఖ్య చదవడం మినహా వ్యక్తిగతంగా నాకు ప్రత్యక్ష పరిచయం లేదు.

ప్రస్తుతం పంజాబ్‌లోని సత్సంగ్ బ్యాస్ ఆశ్రమంలో ఉంటున్నట్లు విన్నాను. బెంగుళూరులోని హైయ్యర్ లైఫ్ ఇనిస్టిట్యూట్ అనే సంస్థ ప్రారంభ సమావేశంలో ఆయన చేసిన ప్రసంగం అంతర్జాలంలో ఉంది. అందులో ఆయన ఆశ్రమాలనేవి భావజాల వాహకాల వంటివని చెబుతూ నిర్ధిష్టమైన కార్యాచరణకు లక్ష్యసిద్ధికి పరిమితమైన ఆశ్రమాలు వాటికాలం అయ్యాక నిష్క్రియాత్మకంగా మిగిలిపోక తప్పదంటారు. మానవ జీవితానికి కాలగతిని మించిన కర్మలేదు. అందుకే ఆశయ సాధనలో ఆశ్రమాలు వాహకాలే కాని గమ్యాలు కాదు, కారాదు.

మానవ జీవన విధానాన్ని సుసంపన్నం చేసే అలాంటి ఆశ్రమాల్ని హృదయపూర్వకంగా ఆహ్వానించడానికి ఎవరికీ ఏ భేషజాలు ఉండనవసరం లేదు. అలాంటి ఆధ్యాత్మికతకీ మానవతకీ పెద్దగా వ్యత్యాసం ఉందని నేను అనుకోవడం లేదు. సామాజిక మాధ్యమాల్లో అప్పుడప్పుడు చేసిన సంక్షిప్త పరిచయాల్ని ఇలా ఒక్కదరికి చేర్చడం జరిగింది. ఈ సంస్థల భావజాలాలు, కార్యక్రమాలు అన్నింటితోనూ వ్యక్తిగతంగా నాకు పూర్తి అంగీకారం వుండాలనే నిబంధన లేదు. కానీ ప్రజాహిత స్థానంలో ఆయా అంశాలమీద దృష్టిపెట్టిన ఆశ్రమాల్ని, వాటి భావజాలాల్ని గురించి క్లుప్తంగా చెప్పడం వరకే ఇది పరిమితమని గుర్తించ మనవి. విమర్శలకు ఆహ్వానం.

# అంకితం



వుచియామా గూడో, జపాన్‌లోని జెన్ బౌద్ధ భిక్షువు. సామాజిక సమస్యల్ని పట్టించుకోని మతం గతమని నమ్మి ప్రజా సమస్యలపై దృష్టిపెట్టి పనిచేశాడు. అనేక బౌద్ధాశ్రమాల్లో ఉంటూ క్షేత్రస్థాయిలో సమస్యల్ని అధ్యయనం చేయడమే కాక పత్రికలు నడిపాడు. సొంతగా ప్రెస్ పెట్టి రచనలు ప్రచురించాడు. అరాజకత్వ (అనార్కో సిండికలిస్ట్) సిద్ధాంత ఉద్యమాన్ని తాత్విక స్థాయిలో అధ్యయనం చేసి ప్రచారం చేసిన అతికొద్ది మంది అరాజకవాదుల్లో ఒకరు.

బాల్యం నుండే బౌద్ధం ప్రభావంతో సాటి జనుల కష్టాల్ని సహానుభూతితో అర్థం చేసుకునే గుణం కలిగిన గూడో చాలా పిన్న వయస్సులోనే ఒక పరిపక్వతగల ఆలోచనా పరుడిగా, ప్రజాపక్ష మేధావిగా ఎదిగాడు. అతడు రాసిన 'Anarchist Communist Revolution' (అరాచక సామ్యవాద విప్లవం) కరపత్రం ఆ కాలంలో ఎంత సంచలనం అంటే, అది చదివిన జనాలు పోలీసులు ఎక్కడ చూస్తారోననే భయంతో ఆ ప్రతుల్ని వెంటనే కాల్చి తగలపెట్టేవారు.

అంతేకాదు చక్రవర్తి హత్యకు డైనమైట్‌తో కుట్ర పన్నాడనే నేరారోపణతో గూడోను ప్రభుత్వం అరెస్టు చేసి జైల్లో పెట్టింది. న్యాయస్థానం విచారణలో గూడో కరపత్రాన్ని ప్రస్తావిస్తూ యావత్ జపాన్ దేశపు చరిత్రలో అత్యంత హేయమైన, ప్రమాదకరమైన రచనగా దానిని పేర్కొన్నారంటే గూడో అక్షరాలు ఆధిపత్య వర్గాలలో రగిలించిన అగ్గి ఎంతటిదో ఊహించవచ్చు. జపాన్ చక్రవర్తి మీజీ హత్యకు కుట్రపన్నారనే కారణంతో 1911లో పాతికమందిపై కేసు పెట్టారు.

హే మార్కెట్‌తో పోల్చదగ్గ ఈ ఘటన High Treason Incident గా పేర్కొంటారు. ప్రపంచ ప్రజా ఉద్యమ చరిత్రలో విశిష్టమైన ఈ కేసులో జపాన్ దేశపు ప్రజానీకం కోసం త్యాగం చేసిన ఎందరో ఉద్యమకారులు అసువులు బాసారు. (ఆసక్తి ఉన్నవారి కోసం అంతర్జాలంలో చాలా సమాచారం ఉంది చూడొచ్చు) బౌద్ధ ధమ్మాన్ని అరాజకత్వంతో మిళితం చేసి ప్రజాతంత్ర వ్యవస్థ కోసం 37 సంవత్సరాల వయసులో అమరుడైన ఉచియామాగూడో చాన్నాళ్ళుగా నన్ను కదిలిస్తూనే ఉన్నాడు.

జపాన్ అరాచకవాదుల్లో కొటుకొ షుషాయ్ వంటి అరాజక తాత్వికుడు మొదలు కొన్నో సుగాకో వంటి మహిళా ఉద్యమకారుల దాక ఎందరో కృషీవలులున్నారు. నిజానికి ఈ మొత్తం వ్యవహారంలో ప్రభుత్వం ఎందరో విప్లవకారుల్ని ఉరితీసింది. మరెందరో ఉద్యమకారులకి క్రూరమైన శిక్షలు విధించింది. ఐతే ఒక బౌద్ధ భిక్షువుగా ఉంటూ తాను నమ్మిన అనార్కిష్టు సోషలిష్టు సిద్ధాంతం కోసం చివరి వరకూ పోరాడి ప్రాణాలు కూడా లెక్క చేయని ఉచియామాగూడో ప్రతి సత్యాన్వేషికి ఒక నిరంతర స్ఫూర్తి.

ఆధ్యాత్మికతను అరాజకత్వాన్ని కలపగలిగిన ఏకైక యోధుడు, ఆధునిక విప్లవ చరిత్రలో బౌద్ధాన్ని ఆయుధంగా చేసుకున్న ధీరుడు. ఇప్పటి నా వయసులో ఎప్పుడో జీవితాన్ని చాలించిన అమరుడు, ఉచియామాగూడో 150వ జయంతి సందర్భముగా ఈ రోజు ఏ కొందరికో మాత్రమే తెలిసీ ఎవరకీ కాకుండా అయిపోయిన అతడ్ని, ప్రపంచ అరాజకవాదులందరి స్మృతిలో వారి త్యాగాల్ని స్మరిస్తూ, వారి మహోన్నత అజరామర కృషికి నావంటి మామూలు మనిషి సమర్పించుకునే ఈ కృతినిలా...










# 1. భారతీయ విశిష్ఠ తాత్త్విక నిలయం

# చార్వాకాశ్రమం

## (మానవీయ వైజ్ఞానిక సౌధానికి అర్ధశతాబ్ది)

ప్రతీ ప్రగతిశీలవాదికి సుపరిచితమైన ప్రదేశం అది. అన్ని ప్రజా ఉద్యమశ్రేణులకీ చిరపరిచితం ఆ స్థలం. అటువైపు వెళ్ళిన ప్రతీ భావోద్యమశీలి ప్రేమగా సందర్శించే చక్కని ప్రకృతి నివాసం. వేమన మొదలు మక్కలి గోశాలుడు, కపిలుడు, కణాదుడు, పాయసి, చార్వాకుడు, అజితకేశ కంబళి ఇంకా సాంఘిక విప్లవకారులైన బుద్ధుడు, అంబేద్కర్, పెరియార్ వంటి అరుదైన ప్రాచీన, నవీన విజ్ఞుల విగ్రహాలతో గుంటూరు జిల్లా మంగళగిరి సమీప గ్రామం నిడమర్రులో ఉపాధ్యాయుడైన రామకృష్ణ మాష్టారు 50 ఏళ్ళ క్రితం 1974లో ప్రగతి విద్యావనం పేరుతో స్థాపించిన అద్వితీయ నిర్మాణమే చార్వాకాశ్రమం. ఒక్క తెలుగు నేలమీదే కాదు, ప్రపంచ దేశాల్లో కూడా ప్రాచీన భౌతికవాదాన్ని ఆదర్శంగా తీసుకొని, మానవీయ ఆలోచనలతో పౌరసమాజంతో కలిసి పనిచేసే సంస్థ బహుశా ఇదొక్కటేనేమో. సుమారు 5000 ఏళ్ళ క్రితమే ప్రజానీకంలో ప్రశ్నించే స్వభావాన్ని నెలకొల్పి హేతువాదాన్ని ప్రచారం చేసిన చార్వాక లోకాయత విధానాన్ని పరిశోధించి సమగ్రమైన జీవనమార్గంగా గుర్తించడమే కాకుండా, అందుకోసం ఎంతో విలువైన సాహిత్యాన్ని ప్రచురిస్తూ ముందు కెళుతున్న ప్రజాచైతన్య సంస్థ ఇది.

నాస్తికత్వం అంటే అదేదో దేవుణ్ని తిట్టడంగా మాత్రమే భావించడం సమాజంలో ఉంది. అందుకు విరుద్ధంగా జీవితంలోని సకల పాశ్వాలనూ సుసంపన్నం చేసుకుంటూనే, ఇతరేతర సాంఘిక అసమానతల్ని ప్రశ్నించడమనే వైఖరి కల్పించడమే లక్ష్యంగా

చార్వాకాశ్రమం పనిచేస్తోంది. అందులో భాగంగా కుల నిర్మూలన, మతోన్మాదం, పురుషాధిక్యత, మూఢ నమ్మకాలు వంటి అంశాలపై దశాబ్దాలుగా పౌరసమాజంలో, ముఖ్యంగా యువతలో అవగాహన కలిగిస్తోంది. ప్రపంచంలో మొట్టమొదటి నాస్తిక కేంద్ర వ్యవస్థాపకులు గోరా, కొండవీటి వెంకటకవి ఆధ్వర్యములో ఏ మత సాంప్రదాయాలు లేకుండా రామకృష్ణ – గృహలక్ష్మి గార్ల వివాహం జరిగింది. నాటి నుండి ఆ దంపతులు ఇద్దరూ ఉద్యమం కోసమే మొత్తం జీవితాన్ని ధార పోశారు. రామకృష్ణగారి తదనంతరం కుమారులు, కోడలు మనుమల సహకారంతో గృహలక్ష్మి గారు ఆశ్రమ బాధ్యతలు చేపట్టారు.

భావోద్యమాలలో సాంస్కృతిక రంగం యొక్క ప్రాముఖ్యతను గుర్తించేవారు అరుదు. కానీ రామకృష్ణ గారు 'సాంఘిక, ఆర్థిక పోరాటాలు బొమ్మాబొరుసులు' తో అన్న నినాదం అనేక సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించారు. ప్రతి ఏడూ చార్వాక కేలండర్‌ని ఏదోక నూతన ప్రజాహిత అంశంతో ప్రచురించడం చేసారు. మనుషుల్ని కలపడానికి మతాలకి పండుగలు ఉన్నట్టే మానవవాదులకి మేళాలు అవసరమని భావించి ప్రతీ సంవత్సరం ఫిబ్రవరి రెండో శని, ఆదివారాల్ని అందుకోసం కుటుంబాలతో సహా మత రహితులంతా వేడుక చేసుకునేలా 'నాస్తిక మేళా' ఏర్పాటు చేశారు. ఈనాటికీ వివిధ సుదూర ప్రాంతాల నుండి కూడా ఆ రెండు రోజులు స్వచ్ఛందంగా అనేకమంది ఆలోచనా పరులు, మేధావులు, విజ్ఞానవేత్తలు ఆశ్రమానికి అభిమానంగా వచ్చి కార్యక్రమాల్లో పాల్గొంటారు. భోజన మరియు వసతి ఏర్పాట్లన్నీ ఆశ్రమ నిర్వాహకులే చేస్తారు.

పసిపిల్లలకి శాస్త్రీయ విద్యను అందించే ఉద్దేశంతో రామకృష్ణ గారు ప్రాథమిక తరగతులకి పాఠ్యాంశాల్ని రూపొందించడమే కాదు అప్పట్లో కొన్నేళ్ళు స్కూలు కూడా నడిపారు. భారతీయ విశిష్ఠ తాత్విక చింతనలోని దార్శనిక దృక్పథాలపై లోతుగా పరిశోధించి పదుల సంఖ్యలో పుస్తకాలు రాశారు. తెలుగులో అంతగా ప్రాచుర్యం పొందని దశాబ్దాలనాటి విలువైన భావోద్యమ గ్రంథాల్ని పునర్ముద్రించారు. సొంతంగా ప్రెస్ ఏర్పాటు చేసుకొని పత్రికలెన్నో నడిపారు. సామాజిక అసమానతల్ని ప్రశ్నించకుండా సిద్ధాంతాల్ని వల్లె వేయడంవల్ల ప్రయోజనం లేదని గుర్తించి ప్రజాసంఘాల్లో, క్షేత్రస్థాయి ప్రజా పోరాటాల్లో భాగస్వామ్యం వహించారు. ఆ క్రమంలోనే రాష్ట్ర వ్యాప్తంగా విస్తృతంగా పర్యటనలు జరిపారు. ప్రతీ ప్రాంతంలోనూ ప్రజా చైతన్యం కోసం పనిచేస్తున్న కార్యకర్తల్ని

గుర్తించి వారితో స్నేహసంబంధాలు పెట్టుకొన్నారు. వామపక్ష, ప్రజాతంత్ర, విప్లవ, రాజకీయ శ్రేణులు అన్నింటితోనూ మమేకమయ్యారు. అద్వానీ రథయాత్రప్పుడు ప్రత్యామ్నాయంగా శంబూక రథయాత్ర నిర్వహించారు. వందల ఆదర్శ వివాహాలు జరిపించారు. ప్రజాఉద్యమ తత్వవేత్త కే.జి.సత్యమూర్తి (శివసాగర్) మొదలు బహుజనోద్యమ బుద్ధి జీవి కలేకూరి ప్రసాద్ వరకూ ఎందరితోనో చర్చించారు. ఎన్నో విమర్శలు, దాడుల్ని కూడా ఎదుర్కొన్నారు. ఐనా ఈనాటికీ ఒక సుస్థిరమైన లక్ష్యంతో సమసమాజ నిర్మాణం కోసం నిబద్ధతతో కృషిచేస్తున్న ఏకైక చార్వాక లోకాయత భావజాల సంస్థ ఇదొక్కటే.

భారతీయ తాత్విక స్రవంతిలోని మానవీయ వారసత్వాన్ని ఆధునిక వ్యవస్థలో రాజ్యాంగ బద్ధ రీతిలో ప్రచారం చేస్తూ, మూఢత్వానికి వ్యతిరేకంగా వైజ్ఞానిక హేతుబద్ధ ఆలోచనా విధానం కోసం అహర్నిశలు పనిచేస్తూన్న చార్వాకాశ్రమాన్ని కాపాడుకోవడం అలోచనాపరులు అందరి బాధ్యత. పాఠ్యాంశాలు మొదలుకొని ప్రదేశాల పేర్లు కూడా ఇష్టంవచ్చినట్లు మారుస్తూ, చరిత్ర స్థానంలో విశ్వాసాల్ని ప్రవేశపెడుతూ, విద్వేష మతతత్వ శక్తులు మితిమీరుతున్న ప్రస్తుత కాలంలో దళిత, బహుజన, అణగారిన వర్గాల ఐక్యతే సాధనగా ఆధిపత్య విధానాలను నిరసిస్తూ ప్రత్యామ్నాయ సంస్కృతిని నిర్మించడానికి నిబద్ధతతో కృషి చేస్తున్న చార్వాకాశ్రమం నిజాయితీకి, పారదర్శకతకి జోహార్లు చెబుతూ అర్ధశతాబ్ది పూర్తిచేసుకుంటున్న మానవీయ సౌధానికి మన:పూర్వక శుభాకాంక్షలు.

(50వ ఏటిలోకి ప్రవేశించబోతున్న భౌతికవాద తాత్విక సౌధానికి శుభాకాంక్షలతో)









# ౨. సత్యమేవ జయతే - సత్యాన్వేషణ మండలి

## (సత్యం పక్షాన నిలవడం - ధర్మబద్ధంగా జీవించడం)

సూర్యాపేట దగ్గర కోదాడ వద్ద ద్వారకుంట అనే గ్రామంలో కాస్త లోపలికి ఉంటుంది సత్యాన్వేషణ మండలి కేంద్ర కార్యాలయం. "ఆధునిక ధర్మశాస్త్రం భారత రాజ్యాంగమే" అనే శీర్షికతో కార్యాలయం ముఖద్వారంలోనే రాజ్యాంగ పీఠికను ఏర్పాటుచేసి, వ్యష్టి, సమిష్టి శ్రేయస్సు, వసుదైక కుటుంబ భావనతో తెలుగు రాష్ట్రాల్లో అసాధారణమైన భావోద్యమ చైతన్యానికి చిరునామా సత్యాన్వేషణ మండలి.

సత్యాన్వేషణ మండలిది ఎన్నో దశాబ్దాల తాత్విక సామాజిక ప్రస్థానం. ఉద్దండ ఆలోచనా పరులనుకునే వారే అడుగు పెట్టడానికి కూడా ఆలోచించే క్లిష్టమైన తార్కిక భావనలకో రూపం కల్పించి, వాస్తవిక దృష్టి, వివేకము, ధర్మాచరణ ఆధారంగా అసంఖ్యాక సంవాదాల్ని, సమాలోచన సమావేశాల్నీ, బహిరంగ చర్చా వేదికల్ని నిర్మించి, నిర్వహించిన అద్వితీయమైన చరిత్ర సత్యాన్వేషణ మండలిది.

హేతువాద, వామపక్ష, మతవాద సంఘాలు అవేవయినా కానివ్వండి, భావోద్యమ రంగంలో మండలి ముక్కుసూటి తనానికి విస్తుపోక మానవు. కొండపల్లి సీతారామయ్య నుండి జిడ్డు కృష్ణమూర్తి వరకూ ఎందరో వ్యక్తులు, సంస్థల సిద్ధాంతాల్ని పట్టి చూసిన చరిత్ర మండలిది. క్షేత్రస్థాయిలో ప్రజాస్వామ్య పరిరక్షణ కోసం, సమాచార హక్కు ఐక్యవేదిక నుండి జనవిజ్ఞాన వేదిక వరకూ అనేకానేక సంస్థలతో కలిసి పనిచేయడం సత్యాన్వేషణ మండలి సంస్థాగత ప్రత్యేకత.

రాజ్యాంగ నిర్మాణ సభలో డా॥ అంబేద్కర్ చేసిన మూడు చారిత్రక ఉపన్యాసాల పుస్తకాల్ని వేల సంఖ్యలో ముద్రించి పంచడం మొదలు భావోద్యమ సంఘాలతో ఐక్య వేదికలు నిర్మించడం అనే సత్సంప్రదాయానికి తెరతీయడం వరకూ, గుర్తింపులకీ, ఘన కీర్తులకి అతీతంగా లక్షణ ప్రమాణ విద్యని శక్తిమేరకు సాధన చేయడమనే పద్ధతి నుండీ దశాబ్దాలుగా నడుపుతున్న వివేకపథం పత్రిక ద్వారా జ్ఞానాన్ని సరైన పద్ధతిలో పొందడమనే విధానం దాకా మండలిదో భిన్న మార్గం.

భిన్నాభిప్రాయాలు ఎన్నయినా ఉండవచ్చు గాక కానీ, సంవత్సరాలుగా సత్యాన్వేషణ మండలి జరుపుతున్న వివేచనాత్మక భావోద్యమానికి బాసటగా వివేకంతో కూడిన భావితరాల్ని మల్చుకోవాల్సిన బాధ్యత సత్యాన్వేషణ మండలి మీద ఉంది. మండలితో అభిప్రాయ బేధాలు ఎన్ని ఉన్నప్పటికీ రాబోయే పౌర సమాజాన్ని ఆలోచనాపరులుగా తయారు చేసుకోవాల్సిన కర్తవ్యం అందరిదీ అనేదే నా భావన.

మిత్రులు, పెద్దలు పుట్టా సురేంద్రబాబు గారితో స్నేహసంబంధాలు, భావవైరాలు వ్యక్తిగతంగా ఎన్నున్నా సత్యాన్వేషణ మండలి నిబద్ధతపై మొదట్నుంచీ నాకు సదాభిప్రాయమే ఉంది. పదేళ్ళ క్రితం 'కరపత్రాల కథా కమామీషు'లో ఏకంగా పదిపుటలు వెచ్చించి మరీ మండలిని ఘాటుగా విమర్శించిన మాట నిజమే. కానీ రానురానూ అసలు సామాజిక ఆలోచనే కుంటుపడుతున్న క్రమంలో సాంఘిక హితాన్ని ఆశించే సంస్థగా సత్యాన్వేషణ మండలి గురించిన ఈ చిన్న పరిచయం.





# 3. సామాజిక చింతన - సంభావన

హిమాచల్ ప్రదేశ్‌లోని ఒక కుగ్రామం కాండ్‌బాడీ. అక్కడ చుట్టుప్రక్కల ఆ పేరుతో రెండు మూడు గ్రామాలున్నా ఆ గ్రామానికి చుక్కాని సంభావన అనే సామాజిక చైతన్య సంస్థ. అనేక అంశాలు విభిన్న ప్రక్రియలపై చర్చలకి, ముఖ్యంగా యువత కోసం ఉద్దేశించిన స్థలమది. దేశవ్యాప్తంగా ఎక్కడెక్కడినుండో ఔత్సాహికులు అక్కడికొస్తుంటారు. చిన్నపిల్లల కోసం మంచి స్కూలు, లైబ్రరీ అన్నీ భలే అనిపిస్తాయి.

కనుచూపుమేర పచ్చని శిఖరాలతో, సప్తవర్ణాల హిమ పుష్పాలతో ఎప్పుడూ తేలే మంచు చుట్టూ పరుచుకున్నట్టుండే ఆ ప్రదేశం, సందర్శకులకి కొత్త జీవాన్నందించే శక్తేదో కల్గి ఉన్నట్టు అనిపిస్తుంది. ఢిల్లీ నుండి హిమాచల్ వెళ్ళే బస్సు దారిలో పంజాబ్ వద్ద ఛండీఘర్ దాటిన వెంటనే ఒకచోట బత్తాయి పండ్లతో చేసిన బెల్లం రోడ్డు వారచేసి అమ్ముతుంటారు. సంభావనలో కూడా ఉండే బెల్లం దాంతో తయారైన పొడి (టీ లోకి భలే ఉంటుంది) ఒరిజినల్‌గా అనిపిస్తుంది. అక్కడ ఫుడ్ ఐతే చెప్పక్కర్లే. అక్కడ పండిన కూరగాయలతోనే చేస్తారు ఎక్కువగా.

రెండేళ్ళ క్రితం భిన్న లైంగికత గురించి వర్క్ షాప్‌కి వెళ్ళాను. అప్పుడే అనుకోకుండా హిమంశుకుమార్ పరిచయం. ఆయన కథ ప్రత్యక్షంగా వినడమే కాక ఆయన రాసిన హిందీ పుస్తకం అనువాదాన్ని చేసింది కూడా అప్పుడే.

చత్తీస్‌ఘడ్‌లో దాదాపు రెండు దశాబ్దాలు తిరుగులేని నాయకునిగా వెలిగిన ఆయనపై ఈ రోజు వంద వారెంట్లు పెండింగ్‌లో ఉన్నాయి. అంతేకాదు ఆయన్ని హత్య

చేయడానికి కూడా కుట్ర పన్నడం జరిగింది. మన అభివృద్ధి ముఖచిత్రం ఆదివాసుల బతుకు విధ్వంసంతో ముడిపడి ఉందనే విషయం కళ్ళకు కట్టినట్టుగా చిత్రించాడాయన. ఆ నా అనువాదం చదివి కదిలిపోని వ్యక్తి ఒక్కరంటే ఒక్కరు కూడా లేరు. అరకు మొదలుకొని ఆదిలాబాద్ వరకూ ఆదివాసీ మిత్రులు దానిని ఆవిష్కరించారు.

అప్పుడే సిమ్లాలో ఉంటున్న మిత్రుడు ఇప్పుడు డిస్కర్డ్ వేదిక కన్వీనర్‌గా ఉన్న జయప్రకాష్, రాధాగారు, నీనాలతో ఒక రోజు గడిపాను. అయిదారేళ్ళ క్రితం లోక్‌నాయక్ జయప్రకాష్ నారాయణ్ రచించిన 'సంపూర్ణ ప్రజాస్వామ్యం దిశగా' అని నేను తెలుగులో వచ్చిన పుస్తకం చదివి ఆయన ఫోన్‌లో పరిచయం చేసుకున్నాడు. ఆయన విజయవాడలో ఉండేవారు.

అలాగే చాలా రోజుల తరువాత మళ్ళీ సంభావనకి వెళ్ళాను బహుశా నాలుగోసారి, ప్రయాణం నన్ను నాకు సరికొత్తగా పరిచయం చేసే ప్రయత్నం, ప్రకృతితో నా పయనం నాగురించి నేను తెలుసుకోవడానికి జరిగే అంతర్మథనం ఈ అడుగుల అవలోకనం.

## మంచి మనుషులు, మంచు కొండలు, మరపురాని జ్ఞాపకాల దొంతరలు

మట్టితో మమేకమై బతకడంపై శోధించిన దీదీ కాంట్రాక్టర్ కుమార్తె మాయ నుండి అణగారిన ప్రజల రంగస్థలంపై ఎన్నాళ్ళ నుంచో కృషి చేస్తూ హిమాచల్‌లోని మారుమూల కొండచివరి గ్రామంలో జీవిస్తున్న కర్నాటక కామ్రేడ్ అరుంధతి దాకా, ఢిల్లీ శేఖర్, డల్హౌసీ సోలోమాన్, చండీఘడ్ రాజేష్, పొట్టకూటి కోసం ఢిల్లీలో ఉంటూ కూడా శక్తికి మించి సమయం వెచ్చించిన భాషాభాయ్ విద్యార్థి యువ మిత్రులు నిరంజన్, శిశు రంజన్, ఇలా ఎందరితోనో ఎన్నో జ్ఞాపకాలు.

ఏప్రిల్‌లో పాలంపూర్‌లోని సంభావనకి ఒక వర్క్ షాప్‌కని వెళ్ళినప్పుడు దక్షిణాది రాష్ట్రాల పట్ల వాళ్ళ చులకన భావం చూసి చిరాకేసింది. ఐతే ఈసారి అక్కడ అద్భుతమైన రీతిలో కట్టిన పిల్లల స్కూల్ ఉడాన్‌ని ఒకరోజు కోసం సందర్శించాం. దీపాభూషణ్‌తో కాసేపు ముచ్చటించాం. పిల్లల విద్యావిధానాల గురించి అధ్యయనం చేస్తోన్న ప్రతి ఒక్కరూ కచ్చితంగా తెలుసుకోవాల్సిన స్కూలది.

అక్కడున్న లెర్నింగ్ సెంటర్ బోసిగా ఉందని చెబుతూ ముఖద్వారం వద్ద ఆకర్షణీయమైన బొమ్మలేమైనా వేయగలరా అని నిర్వాహకులు మా బృందంలోని సభ్యుల్ని అడిగారు. అంతే అప్పటికప్పుడు ఉత్తి సుద్ద ముక్కలతో అర్ధవంతమైన అద్భుతమైన కళాత్మక చిత్రాలు వాళ్ళు చిత్రించిన తీరు చూసి కళ్ళార్పకుండా నిల్చుండిపోయాను.

దేశంలో అరుదైన భావోద్యమ సంస్థగా పేరొందిన సంభావనాలోని పిల్లల కోసం ప్రత్యామ్నాయ పద్ధతిలో నిర్మించిన లెర్నింగ్ సెంటర్ ముఖద్వారం తమిళ మిత్రుల కళా తాత్వికతతో అద్వితీయ సొబగు సంతరించుకొని వెలుగొందడం మనసుకి ఆనందం కలిగించింది. తమిళ, ఆంగ్ల భాషల్లో రాసిన ఆ స్కూలు పేరుని చూస్తూ అప్పుడు మధ్యలో రాసాను హుందాగా తెలుగులో 'ఉడాన్' అని.

ఢిల్లీ పాలంపూర్, ధర్మాన్, నన్‌హర్, కటోయీ, లాంగా, సింధ్ బారి, రక్కర్, ధర్మశాల, నూర్‌పూర్, డల్హౌసీ, కజ్జెర్, అమృత్‌సర్, బాంగా, నవాషహార్, మొహాలీ... ఇలా అనేక మలుపులతో సాగిన అద్భుతమైన ఈయాత్రలో నన్ను భాగం చేసుకుని వారి ప్రేమని పంచిన తమిళ మిత్రులు భారతి, వైష్ణవి, బాలా, భరత్, బెన్నీ, ఓవియా, విష్ణులకి పేరుపేరునా నా హృదయపూర్వక ప్రేమలు.










# 4. తెలుగునేల మీద జై భారత్ ప్రభంజనం

## కార్మోన్ముఖమే కర్తవ్యం - ఖదిజ్ఞాసి ఆశ్రమం

## (విశిష్టమైన విప్లవాత్మక పంథా పరిచయం)

విజయవిహారం పత్రిక ద్వారా తెలుగు రాష్ట్రాల్లో సంచలనం సృష్టించిన జై భారత్ సంస్థ 2015 నుండి తనదైన అన్వేషణా మార్గంలో చేస్తోన్న శోధనే "ఖదిజ్ఞాసి పథం". మతాలలోని అన్ని మానవీయ కోణాల్నీ, వాదాల్లోని విలువైన ఆదర్శాల్ని కలగలిపి ఒక ఉన్నతమైన జీవన విధానాన్ని రూపొందించుకుని పాటించే వారే ఖదిజ్ఞాసులు.

హైదరాబాద్‌లోని ఎల్.బి.నగర్‌లో ఖల్సా భవనం ఉంది. వ్యక్తి ఆంతరిక బాహ్యతలాల్లో జరిపే సమగ్రమైన సంఘర్షణే జీవనసాఫల్యత అని ఖదిజ్ఞాసులు నమ్ముతారు. అందులో భాగంగా చేసే దీక్షలో అధ్యయనం, యోగాసనం, పుడక దహనం, శ్రమైక జీవనాల్ని నిబద్ధతతో అవలంబిస్తారు. ప్రవాహానికి ఎదురీది, చరిత్రను మలుపు తిప్పేవాడే ఖదిజ్ఞాసి.

నిర్మోహత్వం, ద్వేషరాహిత్యం, సమదర్శికత్వం, కరుణ, నిరాడంబరత్వం, నిష్కామకర్మ, నిరంతర విప్లవం, సంయమత్వం, శ్రమ, నిబద్ధత, దేహపటుత్వం, హేతుజిజ్ఞాస ఖదిజ్ఞాసుల 12 లక్షణాలు, లక్ష్యాలు. ఏకత్వ భావన దిశగా సమగ్ర పరిపూర్ణ వ్యక్తిత్వ వికాసం కోసం పనిచేసేవారే ఖదిజ్ఞాసులు.

అన్వేషణకి, ప్రశ్నలకీ ఫుల్‌స్టాప్ ఉండకూడదనీ, భవిష్యత్తులో ఈ విలువలకి అదనంగా చేర్చే సంభావ్యతను ఊహించిన ఖదిజ్ఞాసులు, ఆనందమే జీవనసారమనీ, అదే మానవ లక్ష్యమని భావిస్తారు. ప్రకృతి పట్ల, సకల చారాచర జగత్తులోని ప్రాణుల పట్ల అత్యంత బాధ్యతగా వ్యవహరిస్తారు.

ఖల్సాపంథి, జిహాది, జ్వానాన్వేషి, సాహసి, సన్యాసి, సత్యోపాసి, సమదర్శి, ఏకదర్శి, హేతు జిజ్ఞాసి, జ్ఞానఖడ్గధారి, జ్ఞానాసి, కర్మయోగి, సూఫీ, క్రాంతికారీ వంటి ఎన్నెన్నో పద బంధాల్ని, భావనల్ని సమన్వయించుకుంటూ, స్ఫూరింపచేస్తూ, ధ్వనింపచేస్తూ జై భారత్ విప్లవకారులు ఖదిజ్ఞాసి అనే కొత్తపదం సృష్టించారు.

ఒక్క తెలుగులోనే కాదు, దేశంలోనే విశిష్టమైన తాత్వికతతో దూసుకుపోతున్న ఖదిజ్ఞాసి పథం 5 రాష్ట్రాలలో పూర్తిస్థాయి కార్యకలాపాలు, అలాగే సుమారు 15 రాష్ట్రాలతో వివిధ స్థాయిల్లో సత్సంబంధాలు కలిగి ఉంది. పదివేలకు పైచిలుకు సభ్యత్వం దిశగా మునుముందుకు సాగిపోతోంది.

మిత్రులు, పెద్దలు, ఖదిజ్ఞాసి అజాద్ షేక్ స్మృతిభవనంతో సహా అద్వితీయమైన గ్రంథాలయం, సొంత సినిమాహాలు, విశాలమైన కాన్ఫరెన్స్ హాల్‌లతో నిత్యం పాతిక ముప్ఫై మంది ఉండే ప్రాంగణంలో సమైఖ్యతకి మాత్రమే కాదు, మానవాళి జీవన్ముక్తి వరకూ తనదైన శైలిలో భాష్యం చెప్పగల సత్తాగలది ఖదిజ్ఞాసి ఆశ్రమం.

తెలుగులో కనీవినీ ఎరుగని విధంగా మహా రచయిత చలం స్మృతి భవన్ నుండి భారత ఉపఖండంలో సరిహద్దు గాంధీ ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ స్మృతిలో నిర్మించిన ఏకైక భవనం వరకూ అనేక ఉద్యమాల వెలుగులో ప్రవహించే జైభారత్‌ది అసంఖ్యాక స్ఫూర్తిదాతల పథప్రవాహం. ఎందరో విప్లవకారుల ఆశయ సమాహారం.

కుల నిర్మూలన, స్త్రీ పురుష సమానత, మత సామరస్యం పర్యావరణ పరిరక్షణ, విస్మృతయోధులపై రచనలు, ప్రైవేటు రంగంలో రిజర్వేషన్లు, ఒకటా రెండా విశ్లేషించడం మొదలు పెడితే జైభారత్‌ది సుదీర్ఘమైన చారిత్రక ప్రస్థానం. వివరించాల్సి వస్తే సాహసోపేత సార్థక్యతా సోపానం.

ఎవరికెన్ని భిన్నాభిప్రాయాలు ఉన్నా జైభారత్ తెలుగు నేల మీద చూపించిన శక్తివంతమైన యువ ప్రభంజన ప్రభావాన్ని ఒప్పుకుని తీరాలి. అద్భుతమైన తాత్వికత దిశగా కొనసాగుతున్న ఖదిజ్ఞాసి పథం ఒక సమగ్రమైన స్వతంత్ర భావ విప్లవంగా భాసించి, భావితరాలకు మహోన్నత స్ఫూర్తిని అందిస్తుంది.

జైభారత్ మిత్ర సంస్థ, రమణమూర్తి, లోక్నాద్, సత్యం, ఉమ, రజనీ, కృష్ణవేణి తదితర ఖదిజ్ఞాసి యోధుల గూర్చి వివరంగా రాయాల్సి ఉంది. అలాగే వివిధ జైభారత్ ప్రచురణ గ్రంథాల గురించి గతంలోనే నేను విశ్లేషిస్తూ పరిచయం చేశాను. అలాంటి జైభారత్ తాత్విక తృష్ణకి పరాకాష్టగా నిల్చిన ఖదిజ్ఞాసి ఆశ్రమం గురించి ఎప్పట్నుంచో చేద్దామని అనుకుంటున్న ఈ చిన్న పరిచయం.







# 5. వర్తమాన స్ఫూర్తిస్థలి
# యూసఫ్ మెహరలీ సెంటర్

మహారాష్ట్రలోని ముంబై – గోవా రహదారిలో బొంబాయి సిటీకి 60 కి.మీ. దూరంలో రాయగడ్ జిల్లాకి చెందిన చిన్న గ్రామం 'తారా'. అక్కడ 1961లో స్థాపించబడిన అరుదైన ప్రజాపక్ష ఆశ్రమం యూసఫ్ మెహరలీ సెంటర్. సమకాలీనంగా జరుగుతున్న ప్రత్యామ్నాయ ప్రయత్నాలకు ప్రత్యేక చిరునామా అది.

స్వాతంత్ర్య ఉద్యమంలో తిరుగులేని సోషలిస్టు నాయకుడు యూసఫ్ మెహరలీ. భగత్‌సింగ్ వంటి ఎందరో యువతని ఉత్తేజపర్చిన సైమన్ గోబేక్ వంటి నినాదాలతో పాటు క్విట్ ఇండియా అంటూ ఉద్యమానికి ఉవ్వెత్తున ఎగసే ఉత్సాహాన్ని నిర్మించడంలో మెహరలీ పాత్ర ప్రధానం. ఆయన స్ఫూర్తితో నిర్మాణాత్మక కార్యక్రమాలు చేస్తున్న సంస్థ ఇది.

సోషలిస్టు ఉద్యమకారుడు జి.జి.పారిఖ్ ఆధ్వర్యంలో నడుస్తున్న ఈ సంస్థకి దేశవ్యాప్తంగా గుజరాత్, మధ్యప్రదేశ్, ఉత్తరప్రదేశ్, ఒడిశా, బీహార్, ఉత్తరాఖండ్, కాశ్మీర్ వంటి చోట్ల కూడా విభాగాలు ఉన్నాయి. గ్రామ సాధికారతే లక్ష్యంగా చెప్పుకోదగ్గ కృషి చేస్తున్నాయి.

చుట్టు ప్రక్కల గ్రామాల్లోని స్కూళ్ళని నడిపిస్తూ ప్రయోగాత్మక విద్యావిధానం కోసం కృషిచేయడం మొదలు అనేక విపత్తుల్లో ప్రజలకి అండగా నిలవడం అనేక వస్తువుల్ని సమిష్టిగా తయారు చేయడం, సేంద్రీయ వ్యవసాయ ఉత్పత్తులు ఇలా అనేక విధాలుగా పనిచేస్తున్నారు.

ఎస్.ఎమ్. జోషి సోషలిస్ట్ ఫౌండేషన్, రాష్ట్ర సేవా దళ్, లోకాయత్, అభివ్యక్తి, ఎన్.ఎ.పి.యం., సర్వోదయ్ సమాజ్, యువ బిరాదరీ ఇంకా అనేకానేక సంఘాలతో కలగలసి పనిచేస్తున్న ఈ సంఘం జనతా ట్రస్ట్ నిర్వాహణే కాక జనత పత్రికను కూడా ఇప్పటికీ ప్రచురిస్తోంది. అతి చిన్న వయసులో జాతీయ స్థాయిలో సంపాదక బాధ్యతలు నిర్వహిస్తున్న గుడ్డీ అనే ఆత్మీయ మిత్రురాలు అప్పుడే పరిచయం.

ఏడెనిమిది సంవత్సరాల క్రితం మొదటిసారి సోమయ్యగారితో తారకి వెళ్ళాను. నాటి నుండి అనేక సందర్భాలలో వాళ్ళ సభలూ, సమావేశాల్లో పాల్గొన్నాను. అద్భుతమైన వాతావరణం. అంతకు మించిన రుచికరమైన ఆహారం, ఆహ్లాదకరమైన చర్చలు, గాంధియన్, సోషలిస్ట్, లోహియైట్, లెఫ్ట్, అంబేద్కరిస్ట్, రాయిస్ట్, మార్క్సిస్ట్, కమ్యూనిస్టు, రాడికల్ లిబరల్... ఇలా మార్పుని ఆశించే అందర్నీ కలుసుకోవడం చాలా సంతోషాన్నిచ్చింది.

దేశవ్యాప్తంగా పేట్రేగిపోతున్న ద్వేషానికి వ్యతిరేకంగా జరిగే ప్రతీ నిర్మాణాత్మక ప్రయత్నానికీ కుదిరినంతలో మద్దతివ్వడం ఈ రోజు మరింత అవసరం అని నా అభిప్రాయం. అభిప్రాయబేధాలు ఎప్పుడూ ఉంటాయి కానీ, అణగారిన వర్గాల కోసం జరిగే ప్రతి కృషినీ ఆ మేరకు అంగీకరించి గౌరవించాల్సిందే.

క్విట్ ఇండియా ఉద్యమానికి 78 ఏళ్ళు పూర్తయిన సందర్భముగా చారిత్రక ఆగష్టు క్రాంతి మైదానంలో ఎప్పుడూ జరగాల్సిన కార్యక్రమాలు కోవిడ్-19 కారణంగా జరగకపోవచ్చు. కానీ విబేధాలకతీతంగా నిత్యం అణగారిన దళిత బహుజనులు మొదలుకొని మహిళల మీద జరుగుతున్న దాడుల నేపథ్యంలో గాంధీ ఇచ్చిన నినాదం పదేపదే గుర్తొస్తోంది. కులహంకారం, మతోన్మాదం, అధికార మదాల్ని ఎదుర్కోడానికి వర్తమానంలో అదే స్ఫూర్తి కాగలదేమో ఆలోచించడం అవసరం. ఆ నినాదం "Do or Die", కరో యా మరో, చేద్దాం లేదా చద్దాం.

ఫారిఖ్ గారి ఇంటర్వ్యూ అప్పట్లో తీసుకున్నాను. కానీ ఎక్కడో పోయింది. క్విట్ ఇండియా దినోత్సవాన్ని పురస్కరించుకుని ఎప్పటి నుండో అనుకుంటున్న ఈ చిన్న రైటప్.









# 6. ఆధ్యాత్మిక ఆలయం - వైజ్ఞానిక నిలయం

## (ఒక వినూత్నమైన ప్రాంగణం పరిచయం)

అజ్ఞాతవాదం నుండి అరాజకత్వం వరకూ లెక్కలేనన్ని సిద్ధాంతాలకి నిలయం హిందూ మతం. చార్వాకం నుండి కణాదం దాకా ఎన్నెన్నో అసమ్మతి స్వరాలకి స్థానమున్న మతాల్ని పట్టుకుని వక్రభాష్యాలెన్నయినా రాజకీయ ప్రయోజనాల కోసం చెప్పవచ్చు కానీ, అలాంటి మతోన్మాదానికి చెంపపెట్టు ఈ దేశంలో అనాదిగా అప్రకటితంగానే అమలవుతున్న ఒక అవిభాజ్యమైన లౌకికతా స్రవంతి. సామాన్య ప్రజానీకం స్వచ్ఛందంగా ఆచరిస్తున్న ప్రజాతంత్ర జీవనది. చరిత్ర పొడవునా ఎన్ని అవాంతరాలు వచ్చినా అది తన విభిన్నతను కాపాడుకుంటూనే ఉంది, ఉంటుంది.

అలాంటి ఒకానొక ఆరోగ్యకరమైన వాతావరణానికి నెలవే కేరళలోని త్రిశూర్ జిల్లాలో గల మజువంచరీ ఆలయం. ఆ తరహా దేవాలయం నాకు తెలిసినంతలో మన దేశంలో మరొకటి లేదు. భారతీయ విద్యావిహార్ ఆధ్వర్యంలో వైజ్ఞానిక వారసత్వానికి ప్రతీకగా నిలుస్తున్న ఈ గుడి National Heritage Center, Indian Institute Of Scientific Heritage ప్రాంగణంలో ఉండటం విచిత్రం. ఆర్యభట్ట లైబ్రరీ, భాస్కర్ కంప్యూటర్ సెంటర్, సి.వి. రామన్ హైటెక్ లైబ్రరీ ఇలా ప్రతీ అంశాన్ని అక్కడ భక్తితో పాటుగా విజ్ఞాన శాస్త్రంతో ముడి పెట్టడం చూస్తే కాస్త ఆశ్చర్యం అనిపించక మానదు.

ఇంతకంటే ఎక్కువగా ఆశక్తికరమైన విషయం ఏమిటంటే అక్కడకొచ్చే భక్తులకు ప్రసాదంగా వాళ్ళు ప్రచురించిన దాదాపు వందకిపైబడిన పుస్తకాల్లో ఏదోకటి ఇచ్చి పంపించడం. మూఢభక్తికి వ్యతిరేకంగా అర్ధవంతమైన అన్వేషణా దృక్పథాన్ని ప్రోత్సహించే

ఇలాంటి ప్రయత్నాలు ఆ మేరకు ఆహ్వానించదగ్గవే అని నా అభిప్రాయం. నిజానికి మూడేళ్ళ క్రితం ఆ సంస్థను సందర్శించి వచ్చినప్పటి నుండి పరిచయం రాద్దామనే అనుకుంటూ ఉన్నాను. ఇప్పటికిలా కుదిరింది. ఈమధ్యన ఎవరో దేవాలయాల్లో గ్రంథాలయాలు ఏర్పాటు చేయాలనే చర్చకు తెరలేపిన సందర్భంగా ఇదిలా రాస్తున్నాను.

భావోద్యమ చైతన్యానికి ప్రతీక శ్రీ నారాయణ గురు ఆలోచనల్ని ఇంగ్లీష్, మళయాళం, సంస్కృత భాషల్లో ప్రచురించిన చిన్న పొత్తం అక్కడ్నుంచి తీసుకొచ్చి తెలుగులో ప్రచురిద్దామని అనుకున్నా, రకరకాల పనుల ఒత్తిడి వల్ల అవలేదు. మూఢత్వాన్ని నలుచెరుగులా వ్యాపింప జేస్తున్న మతోన్మాద భారతంలో అక్కడక్కడా మతానికి కొత్తర్థం చెబుతున్న ఇలాంటి ప్రయత్నాల్ని వీలైనంతలో హర్షించడం కూడా మానవోద్యమంలో భాగమే. అందుకే మజువంచరీ మహాదేవ ఆలయలం గురించి ఎన్నటినుండో అనుకుంటున్న ఈ చిన్న రైటప్.















# 7. అందరికోసం నిలిచేదే అసలైన ఆధ్యాత్మికత

## మానవతావాద మహాసంస్థ - మాతృ సదన్

## (ఒక వెనుదీయని పోరాట సంస్థ పరిచయం)

చెప్పడానికేం వంద కబుర్లు చెప్పొచ్చు. వ్యవస్థ నాశనం అయిపోతోందని అంటూ తోచినప్పుడల్లా గగ్గోలు పెట్టొచ్చు. అందరి మీద మన ప్రకోపమంతా ప్రదర్శించి సొంత సిద్ధాంతాలు వల్లించొచ్చు. కానీ నడుంబిగిస్తే కదా అసలు కదనమంటే ఏంటో తెలిసేది, నలుగుర్ని కలుపుకుంటే కదా సమిష్టిగా పోరాటం చేసేది, అలా నమ్మిన సత్యం కోసం దశాబ్దాలుగా సంఘర్షణ చేస్తూ సత్యాగ్రహాన్ని అత్యున్నత స్థాయిలో ఆచరిస్తున్న అసాధారణ సంస్థ మాతృ సదన్.

స్వామి శివానంద సరస్వతి ఆధ్వర్యంలో హరిద్వార్‌లో ఉన్న ఈ ఆశ్రమం మొదటి నుండి పర్యావరణ పరిరక్షణ కోసం పాటుపడుతోంది. ఫొటోలో ఉన్నది స్వామి నిగమానంద సరస్వతి సమాధి. 2011లో మైనింగ్‌కి వ్యతిరేకంగా ఆమరణ నిరాహారదీక్ష చేపట్టినప్పుడు విషం ఇచ్చి హత్య చేయబడ్డ సాధువు. అదేకాదు మైనింగ్ మాఫియా చేతిలో హత్యచేయబడి అడవిలో పారేయబడ్డ శివానంద శిష్యుడు స్వామి గోపాలనంద మొదలు గంగ కోసం నిరాహార దీక్షలో చంపబడ్డ స్వామి సనానంద్ వరకూ మాతృ సదన్‌ది అసాధారణ చరిత్ర.

స్వామి శివానంద్ సరస్వతి మీద కూడా విష ప్రయోగం జరిగింది. సాధ్వి పద్మావతి దీక్ష చేస్తున్నప్పుడు ఆమెపై జరిగిన విషప్రయోగం వల్ల కాళ్ళు చచ్చుబడి మానసిక సమతుల్యత దెబ్బతింది.  నేను అక్కడ ఉన్నప్పుడే ఆమె హాస్పిటల్ నుండి డిశ్చార్జ్ అయి

వచ్చారు. ఇలా పదుల సంఖ్యలో వందలాది రోజులు దాదాపు డెబ్బైసార్లు సత్యాగ్రహం చేయడానికి పోలీసు వ్యవస్థ, న్యాయ స్థానాలు, రాజకీయ నాయకులు, మాఫియాల్ని ఎదుర్కొంటూ ముందుకు సాగడానికి ఎంతటి మనోబలం కావాలి.

ఇంతా చేసి ఆశ్రమం అంతా పది మంది. అద్వైతాన్ని తమదైన రీతిలో అన్వయించుకొని ముందుకు సాగుతున్న ఆ ఆశ్రమానికి ఆధ్యాత్మికత కంటే సామాజిక చింతనే ప్రధానం. నాకు తెలిసి సత్యాగ్రహాన్ని ఇలా ఆచరణాత్మకంగా పాటిస్తున్న ఆశ్రమం మరొకటి లేదు. వాళ్ళ దగ్గర ఉన్న కేస్ ఫైల్స్ చూసి, అక్షరాలా 70కి పైగా చేసిన ఆ సత్యాగ్రహాలకి, సుదీర్ఘమైన పోరాటాలకి నివ్వెరపోకుండా ఉండలేం. భావనల పట్ల ఆచారాల పట్ల ఎవరికైనా భిన్నాభిప్రాయాలు ఉండొచ్చు. కానీ బాధ్యతగా భవిష్యత్తు మానవుడి పక్షం వహించి వాళ్లు చేస్తున్న యుద్ధాన్ని మాత్రం ఎవరికి వారు శోధించి తెలుసుకోవాల్సిందే.

ప్రముఖ శాస్త్రవేత్తలు మొదలు పర్యావరణ వేత్తల వరకు మద్దతిస్తామని వచ్చి వాళ్ళ స్వప్రయోజనాల కోసం ఎలా మౌనం దాల్చారో ఇన్నేళ్ళ నుండి ఆశ్రమ వాసులు చూస్తూనే ఉన్నారు. కాన కొత్త ఉద్ధారకుల మాటల్ని నమ్మేటేంత అమాయకత్వం ఇప్పుడిక వారిలో లేదు. చేతనైతే మనకి తోచిన పద్ధతిలో కుదిరిన మార్గంలో వాళ్ళ నిస్వార్థ లక్ష్యానికి మనసులోనే నమస్కరించి మన వంతుగా కుదిరినంతగా ఈ అంశానికి విస్తృతి పెంచడమే చేయదగ్గ సహకారమని నా అభిప్రాయం.

కేరళకి చెందిన స్వామి ఆత్మబోధానంద్ నుండి బీహార్‌కి చెందిన స్వామి సుధానంద్ వరకూ ఆశ్రమంలో కలిసిన యువకులు ఆధ్యాత్మిక మార్గంలో స్వచ్ఛందంగా జీవన మార్గాన్ని మల్చుకున్న తీరు, అందులో భాగంగా ప్రకృతి కోసం పోరాటం సాగిస్తున్న పద్ధతి అబ్బురం. ఆసక్తి ఉన్నవారు లీసాసబీనాహర్నీ తీసిన 'సత్యాగ్రహ్' అనే డాక్యుమెంటరీ చిత్రం మొదలు ఇంటర్నెట్‌లోని వ్యాసాలు చూడొచ్చు. అల్లోపతిలో అత్యున్నత స్థాయికి ఎదిగికూడా ఆయుర్వేద వైద్యంలో ముఖ్యంగా ఆటిజానికి సంబంధించి ప్రయోగాలు చేస్తున్న డా. విజయవర్మ నుండి విదేశాల నుండి విచ్చేసి ఆశ్రమంలో ఉంటున్న మాతాజీ వరకూ ఇటు కేరళ నుంచి అటు బీహార్ దాకా సత్యాగ్రహ ఉద్యమాన్ని సమిష్టిగా అమలు చేస్తున్న అసాధారణ మాతృ సదన్ గురించి ఇలా ఈ చిన్న పరిచయ రైటప్.








# 8. మతాతీత మానవతకు చిరునామా

## సంత్ కబీర్ నామా

పుట్టినూరు పట్ల ఒకింత ప్రేమ, మట్టి మనుష్యులంటే గౌరవం గల హృదయం ప్రతీ సంవత్సరం రాయపూర్ వైపు లాగేది. అలా వీలున్నప్పుడల్లా మధ్య భారతంలో వాలిపోయే నాకు కోవిడ్ కారణంగా అవాంఛనీయ తీరిక దొరికింది.

అనుకోకుండా టిక్కెట్లు కూడా దొరకడంతో సహచరిణి తీసుకుని వాలిపోయాను. మూడ్రోజుల యాత్రలో భాగంగా రెండు ఆసక్తికరమైన ఆశ్రమాల్ని చూసాను. ఒకటి దామా ఖేడా అనేగ్రామంలో కబీర్ ఆశ్రమం అయితే మరొకటి నవపారా అనే గ్రామంలో కబీర్ మందిర్ పేరిట స్థాపించబడింది. రెండుచోట్ల కాసేపు చర్చించాను.

ఇద్దరూ రెండు భిన్నమైన ఉదారవాద భావజాలానికి ప్రతీకగా అనిపించారు. ఒక శాఖ ప్రకారం కబీర్ భగవత్ స్వరూపుడు ఆయన భూమ్మీదికి నాలుగు రూపాల్లో వచ్చాడు. కలియుగంలో కబీర్‌గా అవతరించాడు. ఈ ఆశ్రమంలో ఒకచోట సాధువులు, ఆధ్యాత్మిక వేత్తల ఫోటోల మధ్య గాంధీని కూడా ఉంచారు.

సత్యసంధతకి గాంధీజీ వెచ్చించిన జీవితాన్ని గౌరవించి అలా పెట్టినట్లు ఆశ్రమ నిర్వాహకులు చెప్పారు. ఇక రెండో శాఖ ప్రకారం కబీర్ మానవ మాత్రుడు, నైతిక ఆచరణ శీలి. మొదటివారు వారసత్వ గురు పరంపరని నమ్మితే, రెండవ శాఖ వారు యోగ్యత ఆధారంగా వ్యక్తిపవిత్రతని విశ్వసిస్తారు. దేశవ్యాప్తంగా కొన్ని ఆశ్రమాలు నిర్మించుకుని బ్రహ్మచర్యాన్ని, కొన్ని నైతిక విలువలను రెండు శాఖలు ప్రచారం చేస్తున్నారు.

ఉత్తర భారత దేశంలోని వారణాశిలో పుట్టి జీవితాంతం హేతువాదాన్ని, తర్కాన్ని ప్రచారం చేసి అనేక అపసవ్య ధోరణలను ప్రశ్నించి హిందూ, ముస్లిం, సిఖ్‌ల మత సమైఖ్యతకి నిజమైన ప్రతీకగా మానవత్వానికి మమేకమైన ప్రవక్తగా నిలిచిన కబీర్ ప్రభావం భక్తి ఉద్యమం పై ఎంత ఎక్కువ ఉందంటే బి.ఆర్. అంబేద్కర్ కబీర్ ని తన గురువుగా ప్రకటించారు.

సామాజిక దృక్పథంతో సాంస్కృతిక రంగంలో పనిచేస్తున్న కబీర్ కళా మంచ్ కార్యకర్తల పట్ల రాజ్యం అనుసరిస్తున్న ఆధిపత్యానికి సాక్షులుగా ఉన్న వేళ దేశ వ్యాప్తంగా లౌకికవాద భిన్న ప్రవంతులన్నీ హైందవీకరణ చెందుతున్న సమయంలో అనేక అభిప్రాయాలతో విభేదాలు ఉన్నప్పటికీ (ముఖ్యంగా స్త్రీల పట్ల కబీర్‌కి గల చులకన భావనకి) విభిన్నతని కాపాడుకోవడంలో భాగంగా ఆయా మార్గాల్ని తెలుసుకోవడం ఆ మేరకు చర్చించటం ఆరోగ్యకరమని నా అభిప్రాయం.

చివరిగా పచ్చని చత్తీస్‌ఘడ్ గ్రామాల్ని చూస్తూ ఉదయపు నీరెండని వెంటేసుకు తిరిగే పిల్లగాలుల్ని తనివితీరా పీలుస్తూ దూసుకుపోతున్న మాకు మారుమూల గ్రామాల్లో కూర్చున్న అంబేద్కర్ విగ్రహం, జైన మహావీరుడి విగ్రహం ఒక భవనంపై ఇష్టపడి వేసుకున్న భగత్ సింగ్ బొమ్మతో పాటు రహదారి ప్రక్క ఒక శ్రమజీవి చేతుల్లో రూపుదిద్దుకున్న నిలువెత్తు కబీర్ విగ్రహం ముచ్చటగొల్పింది.

మనిషికి మద్దతుగా సంత్ రవిదాస్ లాగా (ఈయన కూడా భక్తి ఉద్యమకారుడు, విప్లవాత్మక భావాల ప్రచారకుడు) బేగంపురా, ఆదర్శ వ్యవస్థని మధ్య యుగంలోనే దర్శించి ఛాందసత్వానికి వ్యతిరేకంగా గొంతు విప్పిన ఒక మానవతా వాదిని స్మరించుకోవడం మతోన్మాద సమాజంలో అవసరమే కదా?

తర్వాత కొద్ది కాలానికి కబీర్ చివరి మజిలీ మగహర్ కూడా వెళ్ళొచ్చాను. హిందూ, ముస్లింలు ఇరువురూ చెరో వైపూ పంచుకున్న ఆయన సమాధి స్థలం నాకు తెలిసి ప్రపంచంలో అలాంటి మరో వ్యక్తి లేడు. భావోద్యమకారులు తప్పనిసరిగా అధ్యయనం చేసి తీరాల్సిన మహనీయుడు కబీర్ అనేది నా అభిప్రాయం. ఏవే ఏవే సేన్ నా.... నా మనసులో నిత్యం కొనసాగే అభిమాన దోహా. అలాంటి నిత్యస్మరణీయుడైన కబీర్ కోసం ఈ చిన్న రైటప్.





# 9. ఆనంద సోపానం - ఆబాల గోపాలం

వికారాబాద్ దగ్గర ఒక గ్రామం అత్వెల్లి. మామూలుగా ఐతే ఆ ఊరికి నాకూ సంబంధం ఏం లేదు కానీ అమర్, సుజన కలిసి అక్కడ అందరి కోసం ఒక చిన్న గూడు కట్టారు. అలా ఆ ప్రాంతం ఓ ఆరేడేళ్ళ క్రితం పరిచయం.

అంతకుముందే వారిలో ఒకడిగా నన్ను కలుపుకుని అందించిన ప్రేమాభిమానాల జల్లులో తడిసిన వాడిని కనుక ఆ ట్రాన్స్‌లోకి పోయి కవిగా మారను కానీ ఎందుకనో ఈ లాక్డౌన్ కాలంలో పదేపదే గుర్తొస్తోంది మా ఆబాలగోపాలం. అదేంటంటారా ? అక్కడికే వస్తున్నా. దాదాపు ఎనిమిదేళ్ళ క్రితం హైదరాబాదులో ఉంటూ సామాజిక కార్యాచరణలో భాగంగా తెలంగాణ జిల్లాల్లో తిరిగే క్రమంలో మహబూబ్‌నగర్ ఒక నిజనిర్ధారణకి వెళ్ళినప్పుడు యాదృచ్ఛికంగా పరిచయమైన మిత్రుడు అమర్. ఇద్దరు తాతల ప్రాపంచిక దృక్పథాల వెలుగులో అప్పటికే అధ్యయనంతో సహా తనకో ప్రత్యేకమైన వ్యక్తిత్వం ఉంది. ఎందుకనో నన్నది ఆకర్షించింది. అప్పటి నుండి ఎన్నో కలలు కల్సికన్నాం. కార్యక్రమాలు కలిసి రూపొందించాం. మా ఇద్దరి వ్యక్తిత్వాల్లో భిన్నాలోచనలు లేకపోలేదు కానీ స్నేహం వాటికి అడ్డుకాలేదు. పైగా, విచిత్రంగా బలపడుతూ వచ్చింది.

ఇంతకీ ఇప్పటి విషయానికొస్తే యాంత్రిక జీవితంలో పడి కొట్టుకుపోతున్న బ్రతుకు బండికి బ్రేకులు వేస్తూ బ్రతకడానికి అర్ధం వెతుక్కునే ప్రయత్నాలు కొందరు చేస్తూ ఉంటారు. డబ్బు, ఉద్యోగం, కీర్తి, వ్యామోహం... వీటిని మించిన సత్యం ఏదో ఉందనీ దానిని అన్వేషిస్తూ నలుగురితో గడుపుతూ ప్రకృతిలో ఐక్యం కావడమే సంతోషమనే నా బాపతు జీవులు కొందరున్నారు. అలాంటి వారి కోసం ఉద్దేశించబడిందే ఆబాలగోపాలం.

మనం ప్రపంచాన్నేమీ ఉద్ధరించనక్కర్లేదు, ఉన్నదాన్ని జీవన విధానంతో నాశనం చేయకుండా ఉంటే చాలనే ఆలోచనే ఈ కట్టడానికి పునాది. అభిరుచులకీ అవసరాలకి, విలాసాలకి మధ్య తేడాను తెల్సుకోవడాన్ని మించిన విప్లవం మరేదీ లేదు. దానిని గుర్తిస్తూ మనిషి తన కనీస అవసరాల్ని ప్రకృతితో కలిసో లేదా సమిష్టిగా జీవించో తీర్చుకోవడాన్నే సాధికారత అంటాం.

అందుకోసం అమర్, సుజన ఇంకా అప్పుడప్పుడు అక్కడికొచ్చే మిత్రులు వాళ్ళంతా ఉండే ప్రదేశం ఆబాలగోపాలం. నిజానికి ఆబాలగోపాలం ఆరంభం కాక ముందే ఆ ప్రాంతానికి నేను వెళ్ళాను. నిర్మాణం అవుతుండగా గడిపాను, అయ్యాక వెళ్ళాను. అక్కడున్న ప్రతీ మొక్క, పిచుక, కుక్క, పాము అన్నీ పరిచయం. అన్నింటి కంటే ఎక్కువ భూమి, ఆ భూమితో అనుబంధం.

ఇరువైపులా దట్టంగా పెరిగిన అడవి పూల సువాసనల్ని జుర్రుకుంటూ, ఎడతెరిపి లేకుండా దారంతా పలకరించే పక్షుల కిలకిలారావాల్ని వింటూ, ఎక్కడికక్కడ కనువిందు చేసే నెమళ్ళ వయ్యారాలు కంటూ, సాగే ప్రయాణం ఎప్పుడు తల్చుకున్నా ఒళ్ళు ఒక్కలాగే పులకరిస్తుంది.

ఈ భవన నిర్మాణంలో ఉన్నప్పుడు కొన్నాళ్ళు పాత స్కూలు బస్సొకటి పెట్టుకొని ఆ పొలంలో ఉంటూ రాత్రుళ్ళు అందులోనే ఉండేవారు. అందుకనే చుట్టుప్రక్కల గ్రామాల ప్రజలకి బస్సోళ్ళనగానే అర్థం అయిపోయేది.

ఎర్రటి సూర్యుడ్ని ఎదంతా నింపుకుని నిప్పులుచెరిగే వేసవికాలం, పురుడు పోసుకున్నట్టున్న పుడమికి ఆకాశజలంతో అభిషేకం చేసినట్లుండే వర్షాకాలం, నిర్మలమైన సముద్రం సగంరాత్రి రహస్యంగా నడిచొచ్చి గడ్డకట్టుకు పోయిందా అనిపించే శీతాకాలపు వేకువజాములు అక్కడ అనుభవించడం ఒక అదృష్టం.

అంతెత్తు చెట్లపైకి ఒక్క పెట్టున ఎగిరే నెమళ్ళని విభ్రమంగా చూస్తూ, నక్షత్రాల్లోని నలుసులు రాలిపడి ఎగురుతున్నాయా అని మైమరపించే మిణుగురుల విన్యాసాల్ని వీక్షిస్తూ, సాయంత్రం అయ్యేసరికి విస్మయానికి గురిచేస్తూ భూమిలోంచి బిడ్డలకి భరోసా ఇస్తున్నట్లు అంతటా వ్యాపించే అలౌకికమైన మట్టి సువాసనల్ని ఏరోజు స్మరించుకున్నా అదో అద్వితీయమైన అనుభూతి.

పొద్దస్తమానూ గడ్డిపీకి ఒడ్డుకొచ్చిన నావలా నడుంవాలిస్తే ఎంత మంచి నిద్రొచ్చేదనీ... కష్టం చేసిన దేహాలు చల్లటి నీటితో స్నానం చేసి నాలుగు మెతుకులు తిని మంచి సినిమా చూస్తుంటే ప్రాణమెంత హాయిగా ఉండేదనీ... పొద్దున్నే టౌన్లోకెళ్ళినప్పుడు  పొగలుకక్కే ఇరానీ ఛాయ్, అప్పుడప్పుడు బిర్యాని, మీఠాపాన్, ఎప్పుడైనా బీఫ్... రోజుకో కొత్తరకం కేక్‌తో... ముద్దపప్పు పచ్చావకాయ, అవిసెపొడి, వేపుడు జావ, పచ్చడి. నా ప్రేమకి పెన్నిధిగా నిలిచిన భాగ్యనగరం సాక్షిగా, జంటగా వంతుల వారీగా ఆడుకున్న ఆ తీపి గుర్తుల వైపుగా ఆలోచిస్తుంటే, ఎన్నెన్ని రోజులు నన్ను నేను వెతుక్కుంటూ ఒంటరిగా అక్కడ గడిపానో... ఇంకెన్ని రోజులు స్నేహ సంగమంలో జలపాతంలా కురిసేనో, మరింకెన్ని పూటలు పూదోటలోని తుమ్మెదలా ప్రేమని పొందానో..

అలాంటి ఎన్నో అనుభవాలకి ఆలవాలమైన నా ఆబాలగోపాలానికి ఆనందపారవశ్యంతో అభిమానంగా ఈ అక్షర తోరణమిలా...!











# 10. భావాతీత ధ్యానకేంద్రం - బీటిల్స్ ఆశ్రమం

## (కొన్ని కళాత్మకమైన శిధిలాల వింత కథ)

బీటిల్స్ ఇంగ్లీష్ మ్యూజిక్‌ది ఆరు దశాబ్దాలకి పైబడిన చరిత్ర. సంగీత ప్రపంచంతో ఏ కాస్త సంబంధం ఉన్న వారికీ, రాక్, పాప్ సంగీత సంస్కృతితో పరిచయం కలవారికి బాగా తెలిసిన పేరది. మన దేశంలోని ఆధ్యాత్మికతకీ బీటిల్స్‌కీ ఒక వింత సంబంధం ఉంది. హద్దుల్లేని సంగీత ప్రపంచంలో అత్యంత ప్రభావ శీలమైన గ్రూప్‌గా పేరొందిన బీటిల్స్ మన దేశంలో అంతర్జాతీయ యోగా కేంద్రంగా ప్రసిద్ధి చెందిన రిషీకేశ్‌లోని గంగానది తీరంలో మహర్షి మహేష్ యోగికి చెందిన అంతర్జాతీయ ధ్యాన శిక్షణ సంస్థలో కొన్నేళ్ళపాటు బీటిల్స్ సభ్యులు ఆశ్రమంలో ఉన్నారు.

హిమాలయాల దగ్గర మణికూట్ అనే పర్వతం వద్ద మహేష్ యోగి 65 ఏళ్ళ క్రితం 14 ఎకరాల స్థలాన్ని ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం నుండి లీజుకు తీసుకుని విదేశీభక్తుల ఆర్థిక సహకారంతో ఆశ్రమం కట్టారు. మునికీ రేతి, చౌరాసి కుటియా, శంకరాచార్య నగర్ వంటి పేర్లతో పిల్చుకునే ఈ ప్రాంతం 90వ దశకం నాటికి శిధిలావస్థకి చేరుకుంది. అసాంఘిక కార్యక్రమాలు కూడా ఎక్కువైన దీనిని ప్రభుత్వం నిషేదిత ప్రాంతంగా ప్రకటించింది. మరి కొంత కాలానికి ప్రభుత్వం పూనుకుని రాజాజీ టైగర్ రిజర్వ్ ఫారెస్ట్‌లో భాగంగా మల్లగుల్లాలు పడి మొత్తానికి సందర్శకుల కోసం తెరవడం జరిగింది.

ఈ ప్రాంతం చూస్తుంటే నాకెందుకో ఈ దేశంలో నిలువ నీడ లేని కోట్లాది మంది నిరుపేదల భూపోరాటాలు గుర్తుకొచ్చాయి. కష్టపడి శ్రమించే కార్మికులకి ఉండటానికి కనీసం ఇళ్ళు ఉండవు. కానీ ధ్యానం పేరుతో ఆరోజుల్లోనే ఏకంగా 84 చిన్న సైజు ఇళ్ళే కట్టుకున్న తీరు చూసి ఆశ్చర్యం కలిగించింది. చూడటానికి ముచ్చటగా

ఉన్నంతలో దోపిడీ న్యాయమై పోదుకదా. ధ్యానం మాత్రమే మానవ జీవితానికి అసమానతలకీ పరిష్కారం అని నమ్మి ఒకానొక కాలంలో ఉవ్వెత్తున ఎగిసి పడిన ఆశ్రమ కార్యకలాపాలు ఈ రోజు ఆగిపోగా, ఆ అనుయాయులు ఎక్కడ ఉన్నారో ఏమైపోయారో తెలియదు.

నదిని ఆనుకొని ప్రవాహశబ్దాలు వినిపించేలా నిర్మించిన మహేష్‌యోగి ప్రత్యేక నివాసం మొదలు, వింతగా నిర్మించిన పలు విచిత్ర కట్టడాలు. ముఖ్యంగా ఫోటోగ్రఫీ, గ్రాఫిటీరింగ్ వంటి వాటిపై అభిరుచి ఉన్న వారికి ఆసక్తి కలిగిస్తాయి. అత్యంత చిన్న గుడారాల వంటి కట్టడాల్లో కూడా వెస్టర్న్ టాయిలెట్స్ అమర్చిన తీరు, వాటి నిర్మాణశైలి, ప్రత్యేక డైనింగ్ హాల్, పోస్టాఫీసు వంటివి ఆధ్యాత్మికత పేరిట ఉన్నత వర్గాల ప్రజలకి అమలైన విలాసాలకి ప్రతీకగా అనిపిస్తాయి. సరే ఏదేమైనా కనీసం రాజకీయ నాయకుల కబ్జా పాలవకుండా ఆ మాత్రం బీటిల్స్ చరిత్రను ఈ దేశంలో కాపాడటం కూడా సంతోషమే కదా.

(ఇంగ్లీష్ పాప్ సంగీతానికి సంబంధించిన బృందం 60వ దశకంలో యోగ ధ్యానం నేర్చుకోవడానికి ఈ దేశానికి వచ్చి కొంత కాలం ఉండటం, ఇక్కడ కొన్ని పాటలు కూడా కూర్చడం ఒక విశేషమైతే, వాళ్ళు నివసించిన ప్రాంతాన్ని ప్రత్యేకంగా గుర్తించి, ఆలస్యంగానైనా దానినొక పర్యాటక కేంద్రంగా మలచడం, శిధిలావస్థలో ఉన్న ఆ వింత కట్టడాలపై కూడా సొమ్ము చేసుకోవడమే అయినా ఏదో మేరకు మంచిదే అనిపించింది. పోతే వ్యక్తిగతంగా నాకు ఏమాత్రం నమ్మకం లేని ఈ భావాతీత ధ్యానం (Transcendental Meditation) పై ఎక్కువ మందికే నమ్మకం ఉంది. ఇంటర్నెట్‌లో వెతికి చూస్తే కావల్సినంత సమాచారం దొరుకుతుంది. అనుకోకుండా వెళ్ళొచ్చిన బీటిల్స్ ఆశ్రమం కోసం కొన్ని ఫోటోలతో ఈ రైటప్.)











# 11. ప్రపంచ ప్రశాంతత కోసం ప్రారంభించిన క్షేత్రం

## సర్వేజనా సుఖినోభవంతు - శాంతి ఆశ్రమం

### (శాంతి స్థాపనే లక్ష్యంగా సాగుతున్న పయనం)

ఆయన పథం మనవతా దృక్పథం, ఆయన మార్గం శాంతి థామం, ఆయన లక్ష్యం లోక కళ్యాణం. ఆయనే ఓంకారస్వామీజీగా ప్రసిద్ధి చెందిన శ్రీ వెంకటేశ్వరరావు, విదేశాల్లో పీస్ స్వామీజీగా కూడా విఖ్యాతినొందిన వ్యక్తి, పిఠాపురంలో జన్మించిన ఆయన చిన్నప్పటి నుంచే ఆధ్యాత్మిక భక్తిమార్గాలపట్ల శ్రాద్ధాసక్తి కనబర్చేవారు. 15 ఏళ్ళ వయసులోనే అకాడమీ ఆఫ్ రిలీజియన్స్, అనే సంస్థ స్థాపించి అల్లూరి సీతారామరాజు, తెన్నేటి విశ్వనాధం వంటి వార్ని సభ్యులుగా చేసుకున్న వారు ఆధ్యాత్మికతని మానవతా వాదంతో మిళితం చేసి ప్రపంచ శాంతి కోసం వందేళ్ళ క్రితమే వందెకరాల్లో తోటపల్లి కొండల నడుమ స్థాపించినదే శాంతి ఆశ్రమం.

చిన్నతనంలోనే అమెరికాతో సహా అనేక దేశాలు దేశంలోని వివిధ ప్రాంతాలు క్షేత్రస్థాయిలో వెళ్ళి ప్రజలతో ముఖాముఖి మాట్లాడి రిషీకేష్‌లో సన్యసించిన స్వామీజీ, కులమత ప్రాంతీయతలకీ అతీతంగా జీవితాంతం శాంతి స్థాపనకోసం ఒక రకంగా ఉద్యమించారు. ఆచార్య వినోబాభావే మొదలు జయప్రకాష్ నారాయణ్ వరకూ, స్వామి రామానంద తీర్ధ నుండి ఎన్జీ రంగా గారి దాకా, అమెరికా అధ్యక్షుడిగా పోటీ చేసిన ఎడ్ గర్టెన్ నుంచీ ప్రపంచ ప్రసిద్ధ రచయిత టాల్‌స్టాయ్ కుమారుడు కౌంట్ ఇలియా టాల్‌స్టాయ్ వరకూ శాంతి సందేశానికి ప్రేరేపితులైనవారు, శాంతి సందేశాన్ని ఇంగ్లాండ్, డెన్మార్క్, చైనా, శ్రీలంక, ఆఫ్రికా, జపాన్, బ్రెజిల్, ఫ్రాన్స్, జర్మనీ వంటి అనేకానేక దేశాల్లో వారి వారి భాషల్లో ప్రచారం చేస్తున్న ఔత్సాహికులు ఎందరో ఉన్నారు.

ఒక్క విషయం ప్రస్తావించాలి. తాత్విక చింతనను అంతర్జాతీయంగా ఉన్నత స్థాయిలో నిలబెట్టిన ఇరువురు తాత్వికులు 130వ జయంతోత్సవం జరుపుకోనున్న

జిడ్డు కృష్ణమూర్తి అలాగే శతజయంతోత్సవ తాత్వికుడు కొత్తా సచ్చిదానందమూర్తి వంటి అసాధారణ మేధోసంపత్తి కలిగిన వ్యక్తులు ఆశ్రమంతో సన్నిహిత సంబంధాలు కలిగి ఉన్నారు. ముఖ్యంగా సచ్చిదానందమూర్తి ఆశ్రమానికి గౌరవ ప్రధాన కార్యదర్శిగా కూడా ఉన్నట్లు తెలుస్తోంది. తెలుగు వారికి మాత్రమే కాక భారతీయ తాత్విక చింతనలోనే విశేషమైన కృషిచేసిన ఇలాంటి మహామహుల ప్రసంగ పాఠాల్ని వెలికితీసి ఆశ్రమం ప్రచురిస్తే బావుంటుందనేది నా అభిప్రాయం.

'ది మిషన్ ఆఫ్ పీస్' పేరిట దశాబ్ధాలుగా ఎంతో నిబద్ధతతో కొనసాగిస్తున్న ఆశ్రమ కార్యక్రమం ఒక అవిచ్ఛిన్నమైన మానవీయ ప్రవాహంలో భాగమే. అందుకనే 'అఖిల జగముల భాసించు ఆదిత్యుడెవ్వరి సొమ్ము?' అని ప్రశ్నించిన స్వామి, "ప్రియమిత్రమా నీవెవ్వరవైననూ, ఎచటనుండిననూ, ఆస్తికుడవైనను, నాస్తికుడవైనను, భగవద్విశ్వాసము కలవాడవైనను, కానున్నను, దీని స్థాపకులమైన సభ్యులమైన, ఇందు కార్మికులమైయుండు మాకెల్లరికిది చెందినట్లే నీకును ఇది చెందును. ఏలయన ప్రపంచమున శాంత్యాన్వేషకులందరికీ సమానముగా చెందు ఆస్తి ఇది" అంటారు 'ప్రేమతో నేను మీకు అందజేయు ఆస్తి" అనే తన రచనలో.

పచ్చని ప్రకృతి దృశ్యాల మధ్య పరుచుకున్న శోభాయమాన ఆవరణంలా కాంతులీనే శాంతి ఆశ్రమం మా ప్రాంతం వారనే కాదు దేశంలో అనేక ప్రాంతాల వారికి చిరపరిచితమైనదే. ప్రపంచ శాంతి స్థాపన కోసం మొక్కవోని దీక్షతో ఆశ్రమంలో స్థాపించబడిన నిలువెత్తు శాంతి స్థూపం ఉంటుంది. బుద్ధుడు, మహాత్మాగాంధీ, జీసస్‌క్రైస్ట్, కృష్ణుడు తదితరుల నిలువెత్తు విగ్రహాలు ఎటుచూసినా మనోహర దృశ్యాలు, పక్షుల కిలకిలారావాలు, స్కూలు, పోస్టాఫీసు,ఎక్కడికక్కడ కానొచ్చే మానవతాసూక్తులు, అక్కడక్కడా ఎదురయ్యే పిల్ల కాలువలు, ఆత్మీయ పలకరింపులు, నిత్యం అలరారే వెచ్చటి కుటీరాల కూడళ్ళు, ఆశ్రమాన్ని సందర్శించే ప్రతి ఒక్కరినీ కట్టిపడేసే ఆనందకరమైన జ్ఞాపకాలు.

శాంతి, పీస్, లోక్ కళ్యాణ్ పత్రికలు ఇంకా ఓంకార స్వామీజీ జీవిత చరిత్రతో పాటు ఎన్నో పుస్తకాలు అందుబాటులో ఉన్నాయి. అలానే అటు తమిళనాడు కోటగిరి మొదలుకొని ఇటు రాజస్థాన్‌లోని బూందీ వరకు శాంతి ప్రచార కార్యక్రమాలున్నాయి దేశ విదేశాలలో ఎందరో భక్తులున్నారు, విశాఖలో ప్రసిద్ధి చెందిన కైలాసగిరి ఓంకారస్వామి స్థాపించినదే. ఇలా చెప్పుకుంటూ పోతే ఎన్నో. మతసామరస్యం కోసం, మానవాళి సుఖశాంతుల కోసం ఉద్దేశించిన ఈ ఆరామం గూర్చి నా బాల్యం నుండి వింటూనే వస్తున్నాను. అనేక పర్యాయాలు వెళ్ళాను. ఆసక్తి ఉన్నవారు అంతర్జాలంలో విశేషాలు చూడొచ్చు. 2017లో వందేళ్ళు పూర్తి చేసుకున్న శాంతి ఆశ్రమం కోసం చివరిసారి సహచరితో వెళ్లినప్పుడు తీసిన ఫోటోలతో ఈ చిన్న రైటప్.






# 12. ఆనందానికి బ్రాండ్ అంబాసిడర్ జీవితమే

## జీవిత సారం జీవించడమే - జీవన విద్య

## (అద్వితీయమైన తాత్విక జీవన విధానం)

సుమారు పదేళ్ళ క్రితం నాటి సంగతి. హిమాచల్ ప్రదేశ్‌లోని డీర్ పార్క్ ఇనిస్టిట్యూట్ అనే ఆధునిక బౌద్ధారామంలో జరిగిన జీవన విద్య అనే ఓ అద్భుతమైన వర్క్‌షాప్‌లో పాల్గొన్నాను. అప్పుడు తెలీలేదు కానీ ఆ భావజాల అవసరం ఇప్పుడు తెలుస్తోంది. కార్యశాల జరిగినన్ని రోజులు రాస్తున్న నోట్స్‌కి సమాంతరంగా పుస్తకం వెనుకవైపు అప్పటికే ఉన్న సొంత భావాలను దట్టించి విమర్శలు కూడా రాయటం బాగా గుర్తు. వినీష్ గుప్తా సారధ్యంలో వారం రోజులపాటు ఆహ్లాదకరమైన వాతావరణంలో జరిగిన ఆ సమాలోచన జీవితంలో ప్రతి మనిషీ తెల్సుకోదగ్గ, పాటించదగ్గ మార్గ పరంపర.

కర్నాటకలోని హసన్ జిల్లా, రామనాథపురం దగ్గర అగ్రహారి గ్రామంలో 1920లో జన్మించిన నాగరాజ్ మధ్యభారతంలో అమర్ కంటక్ దగ్గర స్థిరపడ్డారు. ఆయన అన్వేషణా పథంలో రూపుదిద్దుకున్న అద్వితీయమైన తాత్విక జీవన విధానం ఇది. భావవాదానికి భౌతిక వాదానికీ ప్రత్యామ్నాయ విధానంగా, మధ్యస్థ దర్శనంగా వ్యవహరించే ఈ పద్ధతి వెలుగు చూడటానికి వెనుక దశాబ్దాల పాటు నాగరాజ్ చేసిన సత్యాన్వేషణ తాలుకా కృషి ఉంది. రమణ మహర్షి మొదలుకొని, శృంగేరి పీఠాధిపతుల వరకూ అనేకానేక మంది జిజ్ఞాసువులతో రోజుల తరబడి జరిపిన సంవాదాల సారమిది.

మన ఉనికిని అర్థం చేసుకోవటానికి అయినంతలో ఉన్నతీకరించుకోడానికి ఉపకరించే వ్యాయామం ఇది. మనిషి తనతో, కుటుంబంతో, సమాజంతో, ప్రకృతి

ప్రాణులతో అవలంబించవలసిన సహ అస్తిత్వానికి సంబంధించిన లోతైన మానవీయ దృక్పథం జీవన విద్య. 1. సమాధాన్ (వ్యక్తుల నడుమ సరైన అవగాహన) 2. సంసిద్ధి (కౌటుంబిక సామరస్యం), 3. అభయ్ (స్వయంసిద్ధ వ్యవస్థ), 4. సహ–అస్తిత్వ (ప్రకృతి జీవనం) అనేవి ఇందులో ప్రధానం. సామాజిక సర్వతోముఖాభివృద్ధికి అవసరమైన ఆనందకరమైన జీవన సోపానాన్ని నిర్మాణాత్మకంగా ప్రతిపాదించడం జీవన విద్య ప్రత్యేకత.

ప్రపంచవ్యాప్తంగా కొద్ది మంది స్వచ్ఛందంగా ముందుకు తీసుకెళుతున్న జీవనవిద్య కోసం తెల్సుకోవాలని అనుకునేవారికి ఇప్పుడు కావాల్సిన సాహిత్యం, వీడియోలు సామాజిక మాధ్యమాల్లో అందుబాటులో ఉన్నాయి. తెలుగులో కూడా జీవన విద్య సమాచారం లభిస్తోంది. ఈ భావజాలాన్ని అంగీకరించిన ఎందరో అనేక రాష్ట్రాల్లో దీనిని ప్రచారం కూడా చేస్తున్నారు. ఎవరికెన్ని భిన్నాభిప్రాయాలు ఉన్నప్పటికీ, మానవాళి మనుగడకు సంబంధించిన ప్రేమపూర్వక సమైఖ్యతను పెంపొందించే జీవన విద్యను అభ్యసించడం, సాధనచేయడం అవసరమనే నా భావన.

నిజానికి మిత్రులతో జీవన విద్యకి సారూప్యంగా ఒక కార్యక్రమం తెలుగులోనే చేయడనికి ప్రయత్నం చేశాం. ఆ దిశగా కొంత వర్కౌట్ కూడా చేసాను. ఈరకమైన విధానాలు మనలోని మానవీయ కోణాల్ని, సున్నితత్వ స్వభావాల్ని వెలికితీస్తాయనేదే నా నమ్మకం. ఒక మంచి మానవ సమాజం ఏర్పడడానికి కావలసిన అలాంటి దార్శనికమైన ఆరోగ్యకర వాతావరణాన్ని ఏర్పర్చడానికి మించిన పని ఏముంటుంది. అందుకే నాగరాజ్ దంపతుల ఫోటోతో జీవన విద్య గురించి ఈ చిరు పరిచయం.









# 13. అహింసా సత్యాగ్రహాల సమ్మేళనం

## సీతానగర గౌతమి సత్యాగ్రహ ఆశ్రమం

### (గాంధేయవాద భావజాల దర్పణం)

సరిగ్గా నూరేళ్ళ క్రితం పురుడుపోసుకున్న ఒక సామాజిక విప్లవ కేంద్రం, దేశంలోని ఎందరెందరో సత్యాగ్రహుల్ని కార్యాచరణలో కలిపిన పవిత్ర స్థలం, ఉభయ గోదావరి జిల్లాల్లోనే కాదు, యావత్ తెలుగు ప్రాంతాన్నీ స్వాతంత్ర్యోద్యమ శంఖారావానికి పురిగొల్పిన పరమ ప్రాంగణం. "గౌతమి సత్యాగ్రహ ఆశ్రమం".

నవంబరు 9, 1924న ప్రజావైద్యులు డాక్టర్ బ్రహ్మజ్యోస్యుల సుబ్రహ్మణ్యం గారి పూనికతో సీతానగరంలో శంఖుస్థాపన చేయబడి, ఫిబ్రవరి 4, 1925న ప్రారంభించబడిన ఆశ్రమం ఇది. తదనంతరం కస్తూర్బా గాంధీ రాష్ట్రీయ స్మారక ట్రస్ట్‌గా రూపొంది కొనసాగుతోంది. రెండుసార్లు ఆశ్రమాన్ని సందర్శించిన గాంధీజీ స్వయంగా దీనిని మహా సంస్థగా అభివర్ణించి, ఆయా క్రమశిక్షణా కార్యక్రమాలకి ముగ్ధుడై, ఇటువంటి ఆశ్రమం దేశంలో తానెక్కడా చూడలేదని అన్నారంటే ఆనాడే ఆశ్రమం పోషించిన కీలక పాత్ర అర్థం చేసుకోవచ్చు.

ఆశ్రమంలో జరిగిన మహత్కార్యాలు, అహింసా ఉద్యమాలు, ప్రభుత్వ దమన కాండ, మహిళల సాహసాలు, ప్రచురించిన పత్రికలు, దశాబ్దాలుగా సాగుతున్న భావజాల ప్రచారం అంతా చరిత్ర. ప్రస్తుతం నిర్మానుష్యంగా కేవలం 8 మంది ఉద్యోగులతో కళాహీన స్థితికి చేరడం బాధాకరం.

గాంధీజీ ఆలోచనలకిమల్లే ఆశ్రమాలకి కూడా దేశ వ్యాప్తంగా పట్టిన అధోగతికి సీతానగరం గౌతమి ఆశ్రమం కూడా మినహాయింపు కాదు. ఓట్లకి, నోట్లకి మాత్రమే లొంగే రాజకీయ పార్టీలు ఘనచరిత్ర కలిగిన ఈ ఆశ్రమానికి పున:వైభవం తీసుకొచ్చే ప్రయత్నం చేయకపోవచ్చు.

అయినప్పటికీ భావజాల అవసరం ఎప్పటికంటే ఈ రోజే ఎక్కువ ఉందని నా అభిప్రాయం. కాన సహచరితో ఆశ్రమాన్ని సందర్శించి, రచయిత, రఘుదేవపురంలో గౌతమి స్కూల్ వ్యవస్థాపకులు డా॥ బొంగు రాజారావుగార్ని కలిస్తే మరిన్ని విషయాలు చెప్పారు.

మహావ్యక్తి దుర్గాభాయిదేశ్‌ముఖ్ గారు తొలి ప్రతినిధిగా ప్రారంభమైన ఈ ఆశ్రమానికి ప్రస్తుతం సుశీలగారు ప్రతినిధిగా ఉన్నారు. తెలుగు పాత్రికేయ చరిత్రలో ఐదుగురు సంపాదకులు ఖైదులో ఉండి కూడా ఆగకుండా నడిపించిన ఉద్యమ పత్రిక "కాంగ్రెస్" ఇక్కడే మొదలైంది.

ఇలా చెప్పుకుంటూ పోతే ఎన్నో. ఒకనాడు చుట్టుప్రక్కల సుమారు 60పైబడి గ్రామాల్లో నిర్మాణాత్మక కార్యక్రమాలు నిర్వహించిన ఈ ప్రాంగణం నేడు ఏవో కొద్దిపాటి పనులకే పరిమితం అయ్యింది. అలాంటి మహోన్నత ఆశ్రమం గురించి ఈ చిరు పరిచయం.














# 14. పునః మానవీకరించబడే సమాజం కోసం

## పీడితుల దృక్పథం - ప్రత్యామ్నాయ దృక్కోణం

### ప్రజా సాంస్కృతిక రంగస్థలం

### (అగస్తోబోల్, 'థియేటర్ ఆఫ్ ది అప్రస్డ్')

If the structure does not permit dialogue, the structure must be changed. - Paulo Freire

Theatre is a form of knowledge ; it should and also be a means of transforming society. Theatre can help us build our future, rather than just waiting for it. - Augusto Boal

చాలా సంవత్సరాల నుండి వింటూ చదువుతూ వస్తున్నా కానీ సిద్ధాంతాల శక్తిని అంచనా వేసేది ఆచరణే కదా. థియేటర్ ఆఫ్ ది అప్రస్డ్ పీడితుల రంగస్థలం అనొచ్చేమో ప్రత్యామ్నాయ ప్రస్థానంలో భాగంగా ఆరంభ కాలంలోనే నా అన్వేషణకు పదును పెట్టిన ఇరువురు బ్రెజిల్ ఆలోచనాపరులు, ఒకరు పెడాగజి ఆఫ్ ది అప్రస్డ్ సిద్ధాంతవేత్త ఫాలో ఫెర్రీ, రెండు థియేటర్ ఆఫ్ ది అప్రస్డ్ రూపకర్త అగస్తోబోల్. అణచివేత నుంచి ప్రపంచాన్ని విముక్తం చేసే ఆయుధాలు.

బెంగుళూరులోని ఇండియన్ సోషల్ ఇనిస్టిట్యూట్‌లో CCDC (Centre for Community Dialogue & Change) ఆధ్వర్యంలో రాధారామస్వామి, రవిల సారధ్యంలో జరిగిన గొప్ప ప్రయోగం Breaking Patterns, Creating Change. ఇందులో సాంప్రదాయ నాటకం మీదనున్న భ్రమల్ని పటాపంచలు చేసి ప్రజాతంత్ర కళని కళ్ళకి కట్టి చూపించడమే కాదు, బహిరంగ ప్రదర్శనతో పాటు పిల్లలతో కలిసి పనిచేసే కార్యాచరణకు కంకణం కడతారు.

మహారాష్ట్ర, గుజరాత్, కేరళ, కర్ణాటక, తమిళనాడు, జమ్మూ, చత్తీస్‌ఘడ్, ఒడిషా, బెంగాల్ తదితర ప్రాంతాల నుండి వచ్చిన దాదాపు ముప్పై మంది మధ్యన తెలుగు ప్రాంతం నుండి నేను పాల్గొన్నాను. ప్రత్యామ్నాయ ప్రజాకళను అధ్యయనం చేయడం ప్రచారం చేయడమే లక్ష్యంగా చేసుకొని పనిచేస్తున్న సాంస్కృతిక కార్యకర్తలు, సంస్థలు తమ సర్వజ్ఞతను పక్కన పెడితే త్వరలోనే తెలుగు ప్రాంతాల్లో ఈ అంశం గురించి కార్యక్రమాలు జరుగుతాయని ఆశ.

70 దేశాలకు పైబడి అణగారిన ప్రజల పక్షాన నిలిచిన ఈ శక్తివంతమైన అభివ్యక్తిని అమెరికాలోని Mandala Center for Change కి చెందిన మార్క్ విన్స్లెట్ నుండి నేర్చుకొచ్చి దశాబ్దాలుగా ఆచరణలో పెడుతున్నారు రాధ. CCDC కి రాధా, వాళ్ళ అబ్బాయ్ రవి వ్యవస్థాపకులు. నిరంతరం ప్రత్యామ్నాయ ప్రజారంగ స్థలంపై పనిచేసే ఉత్సాహం ఉన్నవారు. నిజానికి ఐదేళ్ళ క్రితమే రవి ఆధ్వర్యములో జరిగిన ఒక వర్క్ షాప్‌లో పాల్గొనాల్సింది, కాలేదు.

కెనడాకి చెందిన డేవిడ్ డైమండ్ సారధ్యంలోని ధియేటర్ ఫర్ లివింగ్ (TFL) మొదలుకొని న్యూయార్క్ ధియేటర్ ఆఫ్ అప్రెస్డ్ (NYC) వరకూ అనేక దేశాల్లో భిన్న ప్రయోగాలు జరుగుతున్నాయి. మన దేశంలో కూడా అనేక చోట్ల ఈ ధియేటర్ ఆఫ్ ది అప్రెస్డ్ కోసం పనిచేస్తున్న వ్యక్తులు, సంస్థలు ఉన్నాయి. బెంగాల్‌కి చెందిన ధియేటర్ సంస్థ “జన సంస్కృతి” ముక్తధార పేరుతో ప్రజా రంగస్థల ప్రదర్శన కార్యక్రమం కూడా నిర్వహిస్తోంది.

ఆటలు, కేకలతో ఆరంభమయిన ఈ కార్యక్రమం ఎంత శక్తివంతమైనదో, ఆధిపత్య వ్యవస్థల్ని ఎంత సమర్ధవంతంగా ఎదుర్కోగలదో అర్ధం చేసుకుంటే ప్రత్యామ్నాయ సాంస్కృతిక స్రవంతిలో దీనికున్న ప్రాధాన్యత, విశిష్టత బోధపడతాయి. ఈ అణగారిన ప్రజా రంగస్థలం లక్ష్యం పునఃమానవీకరించబడటం, మళ్ళీ మళ్ళీ మానవీకరణ చెందడం (Re-humanize Ourselves) అంటాడు బోల్. అదర్ధమైతే అసలు ఇదెందుకో అర్ధమవుతుంది.

మన జీవితాల్ని అర్ధవంతంగా మల్చుకోవడానికి అవసరమైన బలమైన ముద్ర వేయగలిగే గాఢత కలిగిన భావాలను ఆహ్వానిద్దాం రండి. వ్యక్తిగత సామాజిక, రాజకీయ

పార్శ్వాలన్నింటినీ సమిష్టిగా ప్రజాస్వామికం చేసుకుందాం పదండి. నిజమైన మార్పు ఎప్పుడూ నిజాయితీగానే ఉంటుంది. నిష్కళ్మషంగానే వస్తుంది. నిరాడంబరంగానే జరుగుతుంది. అసమానతా సమాజంలో అన్ని రకాల వివక్షతలకి వ్యతిరేకంగా, మానవీయ మహామార్పులకి మనవంతు ప్రయత్నిద్దాం సిద్ధం కండి.

ప్రజా రంగ స్థలం ప్రతి ఒక్కరిదీ. అన్ని రంగాలదీ. మార్పు మనతోనే మొదలవ్వాలని తపించే వారందరిదీ వేదిక. మార్పు కోసం స్వచ్ఛందంగా శ్రద్ధ, సమయమూ ఇవ్వగలిగితే చాలు. ఆసక్తి ఉన్నవారికోసం ఆన్‌లైన్‌లో అవసరమైన సమాచారం ఉంది. కావలసినంత మెటీరియల్, పుస్తకాలు ఉన్నాయి. ఔత్సాహికులు సంప్రదించవచ్చు. ఎంతో కాలం నుండి అనుకుంటున్న మానవీయ మార్పు మాధ్యమం, థియేటర్ ఆఫ్ ది అప్రెస్డ్ గురించి చిరు పరిచయంతో ఈ చిన్న రైటప్.






# 15. గాంధీ సత్యమూ – గాంధీ సత్రమూ

మూఢభక్తిని ప్రశ్నించినందుకు గానూ కేవలం వేధించేందుకు అక్రమ కేసులు నాపై పెట్టడం జరిగింది. పేరుమోసిన నాస్తికులు, హేతువాదులు మాటలూ రాతలకే కానీ చేతల దగ్గరకి వచ్చేసరికి చెయ్యందించరనే విషయం ఆలస్యంగా తెలుసుకునే నాటికి పరిస్థితి చెయ్యి దాటిపోయింది. పెద్ద విప్లవ ఆడంబరాలు పలికే లాయర్ల నిజ స్వరూపాలన్నీ తెలిసి వచ్చాయి. కనీస నైతికత అనేది కూడా లేకుండా కేవలం డాబు కోసం లాయర్ అవతారం ఎత్తి వాగాడంబరం ప్రదర్శించుకునే ప్లీడర్ల పీడనకు సజీవ సాక్ష్యంగా నిలిచిన నాకు చేస్తున్న లాయరు వృత్తినొదలి అంతరాత్మ ప్రకారం నడుచుకున్న గాంధీ ఈ రోజు విచిత్రంగా గుర్తొచ్చారు.

కోర్టు పనిగురించి తూ.గో. విశాఖ జిల్లాల సరిహద్దు పట్టణం తునిలో బస్సు కదులుతుండగా అకస్మాత్తుగా గాంధీ సత్రం అని కనబడింది. చాలా సంవత్సరాల నుండి గొల్ల అప్పారావు సెంటర్‌లో కాకినాడ బస్ ఎక్కుతున్నా కానీ ఎప్పుడూ ఎందుకు చూడలేదా, అని ఆశ్చర్యం కలిగించింది. 1915లో స్థాపించబడిందంటే 105 ఏళ్ళవుతోందన్నమాట. నిజానికి ఉదయం నుండి చాలా నీరసంగా ఉంది. అనుకున్న పని అవలేదు. చిరాగ్గా కూడా ఉంది. ఇంతలో మాఊరు నుండి మిత్రులు ఫోన్ చేసి రేపు గాంధీ వర్ధంతి సందర్భముగా మద్యపాన వ్యతిరేక ప్రచారంలో భాగంగా ఒకరోజు రిలే నిరాహార దీక్ష ఏర్పాటు చేయబోతున్నట్లు చెప్పారు. అంతే, కదులుతున్న బస్సును ఆపమని దిగిపోయాను. అనేక ఆలోచనల మధ్య ఆ పాడుబడ్డ సత్రంలోకి వెళ్ళాను.

మొన్న కలకత్తా ఫిల్మ్ ఫెస్టివల్‌లో ఆనంద్ పట్వర్ధన్ 'రీజన్' ప్రదర్శన సందర్భముగా ఆయన మాట్లాడుతూ గాంధీ – అంబేద్కర్‌ల సిద్ధాంతాల్ని ప్రస్తావిస్తూ వారివి మిత్ర వైరుధ్యాలే కానీ శత్రుపూరిత విద్వేషాలు కావనే కామెంట్తో సుదీర్ఘంగా మాట్లాడారు. అంతకుముందే Ethics is Answer అనే వ్యాసమేదో ఆయన రాసినట్లు గుర్తు. (నేనది చంపారన్ వ్యాసానికి రిఫరెన్స్‌గా ప్రస్తావించాను కూడా) ఆ రాత్రే కలిసి పనిచేయడానికి కారణాలు అనేకం ఉండగా ఆ విభేదించే ఒక్క విషయం కోసం తన్నుకు చావడం ఎందుకనేది ఉద్యమ శ్రేణులు గ్రహించాలనే ఐక్యవేదిక సూత్రాన్ని అప్పుడే మిత్రులతో పంచుకున్నాను. గాంధీజీ చంపారన్ సత్యాగ్రహం గురించిన పుస్తకం అనువాదం చేసినప్పుడు ఎవరో ప్రశ్నించారు... మీది ఆస్తికత్వమా ? నాస్తికత్వమా అని. మానవత్వం అని చెప్పాను.

గాంధీ సిద్ధాంతాలతో నా విబేధాలు, ఆయన భావాల పట్ల వ్యతిరేకతా కాదు, ఆ క్షణం నమ్మిన విలువలపట్ల నిర్భయంగా చివరిదాకా నిలిచిన ఆయన అంతర్వాణి ధీరత్వం మాత్రమే కనబడింది. బహుశా ఆయన్ని మనకంటే మన శత్రువులే బాగా అర్ధం చేసుకున్నారు. కనుకనే ఆయన భావాలు ఉన్మాదానికి ఎంత ప్రమాదకరమో గ్రహించి ఆయన్ని హత్య చేసారు. ఎంత జీవితం... ఏం పోరాటం... జీవితాంతం తనని తాను మార్చుకునే లక్షణం. ఈ క్షణం మార్క్స్ నుండి అంబేద్కర్ వరకూ అంతా ఒక్కసారిగా ఆలోచనల్లో మెరిసారు. భిన్న భావాలుండటం తప్పుకాదు. ఆమాటకొస్తే భిన్నత్వాన్ని ఆహ్వానించకపోవడమే ఉన్మాదం.

ప్రస్తుతం ప్రభుత్వాధ్వర్యంలోని దేవాదాయ ధర్మాదాయ శాఖ నిర్వహిస్తున్న ఆ సత్రం లోపలకెళ్ళి అడగ్గా ఇప్పుడెవరూ లేరనీ ప్రస్తుతం ఆ భవనాన్ని గోడౌన్ తదితర కార్యక్రమాలకోసం వాడుకుంటున్నట్లు పూలు తదితర వ్యాపారస్తులు చెప్పారు. ఇంటర్నెట్‌లో వెతగ్గా 66 దుకాణాల సముదాయంగా ఉన్న ఆ సత్రం చెత్త రాజకీయాలు, లోపాయికారీ వివాదాల కేంద్రంగా మారినట్లు పాత పత్రికలవల్ల తెలిసింది. లోపల ఒక శివాలయం ఉంది, భవనం మొత్తం పాడుబడింది. డిస్ మాంటిల్ చేస్తారని చెప్పారు. ఉచిత హోమియో వైద్యశాల కూడా ఉన్నట్లు తెలుస్తోంది. కొన్ని ఫోటోలు తీసాను. తెలంగాణాలో నల్గొండ దగ్గర ఒక వ్యక్తి గాంధీజీకి గుడి కట్టించడం, ఉత్తరాంధ్రలోని ఒక గ్రామంలో గాంధీని దేవుడిగా పూజిస్తూ, ఉత్సవాలు చేయడం గురించిన వార్తలు తెలుసు కానీ ఇంతకాలం

ప్రక్కనే ఉన్నా ఇంత పెద్ద సత్రం ఎందుకు కనిపించలేదో అనే విషయం. అందులోనూ అది దేవాదాయ శాఖ ఆధ్వర్యంలో ఉంది.

గాంధీని ఒక మతానికి తాబేదారుగా మల్చేపని చాలా కాలం క్రితమే మొదలైంది. ఆ కుట్రలో భాగంగానే ఆయన అందరికీ దూరం చేయబడ్డాడు. ప్రగతిశీల కూటముల మధ్య వీలైనన్ని విద్వేషాలు సృష్టించడం ఉన్మాదుల వ్యూహం. దశాబ్దాలుగా దానిని అమలు చేయడంలో వాళ్ళు విజయం సాధించారు కనుకనే ఈ రోజు గాంధీ, అంబేద్కర్, లోహియా, మార్క్స్, రాయ్ తదితరుల శ్రేణులన్నీ తిరిగి కలవలేనన్ని ముక్కలు చెక్కలై ఉన్నాయి. ఇప్పటికైనా ఈ కుతంత్రాన్ని గ్రహించడం అవసరం.

రాజ్యాంగ విలువల్ని గాలికొదిలి పౌరసత్వ బిల్లు పేరుతో దేశ పౌరులపై ఒక అక్రమ ఆధిపత్యాన్ని రుద్దడానికి ప్రయత్నిస్తున్న ప్రస్తుత పరిస్థితిలో గాంధీ సత్యాన్వేషణా దృక్పథానికి మద్దతివ్వడం అంటే అమలవుతున్న మతోన్మాదాన్ని నిరసించడంలో భాగంగానే భావించాలని నా అభిప్రాయం. భవనాలు శిధిలమవ్వచ్చు కానీ మానవాళి ఔన్నత్యానికి తోడ్పడే భావాలు ఎప్పటికీ బతికే ఉంటాయి. ఆ ఫోటోలు పెడుతున్నాను మిత్రులెవరైనా ఆ సత్రానికి సంబంధించి అదనపు సమాచారం అందిస్తే సంతోషం. సెలవు.



# ముగింపు

అయిదారేళ్ళ క్రితం కొద్దిమంది మిత్రులు కలిసి "మనవతా మిత్ర మండలి" అనే సంఘటనగా కొంతకాలం కలిసి కార్యక్రమాలు నిర్వహించారు. ప్రత్యామ్నాయ పద్ధతులకి అంకితమైన ప్రపంచ సంచార సామాజిక కార్యకర్త ఈ.పి. మీనన్ నుండి ఎలంగో వరకూ అనేక రాష్ట్రాల నుండి కూడా ఆ సమ్మేళనాలకి వచ్చిన వారున్నారు.

అలాంటి ఒక కార్యక్రమంలోనే చంద్రశేఖర్ అనే పెద్దాయన పరిచయం, భద్రాచలం దగ్గర చట్టి అనే గ్రామంలో గాంధీ ఆశ్రమాన్ని పెట్టినాయన స్వతహాగా తమిళుడు. జీవితంలో ఎన్నెన్నో ఒడిదుడుకులు ఎదుర్కొన్న ఆయన్ను కలిసి ఇంటర్వ్యూ కూడా చేశాను. దురదృష్టవశాత్తు నా అస్థిరత్వం కారణంగా అనేక విలువైన నోట్స్ లాగానే అది కూడా పోగొట్టుకున్నాను.

చట్టి–చింతూరు మధ్యన ఆదివాసీ ప్రజల మధ్య జీవిస్తూ, స్థానిక ఆదివాసీ మహిళనే భాగస్వామిగా చేసుకుని "మహాత్మాగాంధీ శబరి ఆశ్రమం" స్థాపించిన కీ॥శే॥ వాలాడి బాలసుబ్రహ్మణ్యన్ చంద్రశేఖరన్ గురించి చేయాలనుకున్న పరిచయం, ఇంటర్వ్యూ మరుగున పడిపోయింది. ఇలా కొత్తా శివమూర్తి నుండి లాలం సుబ్బయ్య వరకు ఎందరో..

అంటే అతిగా ఉంటుంది కానీ నిజమేంటంటే నేను రికార్డు చేసిన వాటి కంటే పోగొట్టుకున్న మెటీరియలే ఎక్కువ, ఒక పద్ధతిపాడూ లేకండా కాళ్ళకు చక్రాలు కట్టుకు తిరిగిన ఒకనాటి కాలంలో రాసుకున్న కొక్కిగీతల నోటు పుస్తకాలు ఆయా వ్యక్తులు, ప్రాంతాలు, సంస్థల వివరాలు ఉన్నవి దొరికితే ఎంతో బాగుంటుంది.

తెలుగులో భావోద్యమ సంస్థల చరిత్ర చిన్నది కాదు. లోక కళ్యాణ భవన్ పేరిట ప్రఖ్యాత హేతువాది గుత్తా రాధాకృష్ణ గారి కుటుంబం ఒకనాడు స్థాపించిన నాటి భవనం నుండి లోకాయుత ప్రచురణల పేరిట కత్తి పద్మారావు గారు నెలకొల్పిన సంస్థ వరకూ ఎంతో విస్తృత స్థాయిలో అధ్యయనం జరగాల్సిఉంది. కానీ చేసే ఆసక్తి, చేయగల ఆ'శక్తి' ఎవరికున్నాయి.

అనంతపురంలోని టింబక్టు అనే సంస్థలో ఒకసారి హిందీ టీచర్ ఉద్యోగానికని ఇంటర్వ్యూకి వెళ్ళి వాళ్ళ కార్యక్రమాలు చూసిన నాటి నుంచీ, కేరళలోని ఇంటర్నేషనల్ ఇనిస్టిట్యూట్ ఫర్ సోషల్ ఎంటర్ప్రెన్యూర్స్ (బ్రెయిలీ వితౌట్ బార్డర్స్) అనే సంస్థలో చేరడం కోసం చేసిన తీవ్రమైన ప్రయత్నం వరకూ ఎన్ని వందల సంస్థలో.

ఆనాటి సంచార స్మృతుల్లో ఎన్ని న్యాయంగా నా జ్ఞాపకాల్లో ఈనాటికి నిలిచి ఉన్నాయో. ఇంకెన్ని సున్నితంగా మాయమైపోయి నన్ను బోల్తా కొట్టించాయో, ఇప్పుడేం చేసినా నాటి సంస్థల గురించి జ్ఞాపకాల్ని, అనుభవాల్ని మళ్ళీ వ్యక్తీకరించ లేకపోవచ్చు. అందుకే ఒకందుకిలా తల్చి దీన్నిలామల్చింది.

ఇదెంత వరకూ సఫలీకృతమైందో చెప్పాల్సింది పాఠకులే. అనేక వింత సంక్షోభాలు సమాజాన్ని నిర్వీర్యం చేస్తున్న సమయంలో ప్రజాపక్ష గళాలు, కలాల కర్తవ్యం రెట్టింపు అవుతుందనే అభిప్రాయమే ఈ అక్షరాలకి ఆలంబన. చదివాక మీ విలువైన ఆలోచనలు పంచుకుంటే సంతోషం. సెలవు.

# మనలోని మానవత్వాన్ని బ్రతికించుకుందాం !

మనిషంటే కేవలం పదార్థం కాదు, మనిషి ఒక చైతన్యపూరిత ప్రవాహం, మనిషంటే శుద్ధ భౌతికం కాదు, మనిషి ఒక ఆత్మికమయిన అస్తిత్వం. మనిషంటే వినిమయ విధ్వంసమే కాదు, మనిషి విలువల నిర్మాణం కూడా, మనిషంటే శరీరంపై ప్రేమ మాత్రమే కాదు, మనిషంటే సామాజిక బాధ్యత కూడా.

అలాంటి బాధ్యతను నిర్వహించడమంటే మన వంతు సమాజానికి మంచి చేయడానికి సిద్ధపడ్డట్లే, నిత్యం ఎంతోమందికి వివిధ రూపాల్లో స్వచ్ఛంధంగా సేవలందించే అవకాశం మనందరికీ ఉంది. మనం జీవించి ఉండగా రక్తదానం ఎలా చేయగలమో, మరణానంతరం నేత్రదానం, అవయవదానం, దేహదానం అలాగే చేయగలం.

చనిపోయాక కూడా మననేత్రాలు ఇద్దరికి చూపునిస్తే, అవయవాలు మనల్ని ఆపద్భాంధవుల్ని చేస్తాయి. అలాగే భావితరాల వైద్యులకు మన శరీరదానం ఎంతో అవసరం. శరీరాన్ని కాల్చడమో – పూడ్చడమో చేసి వృధా చేసేకంటే నేత్రదానం, అవయవదానం, దేహదానం ద్వారా మరణాంతరం కూడా మంచిపనికి చేయూతనివ్వవచ్చు.

**అందుకే, రండి.**
**రక్తదానం, నేత్రదానం, అవయవదానం, దేహదానాలని చేద్దాం,**
**చేయడానికి ప్రోత్సహిద్దాం.**
**మరణించినా జీవిద్దాం.**





మంచి మనిషి, ప్రజాహితకారి, నిష్కల్మశీలి కీ॥శే॥ రావూరి శివయ్య (సాంబశివరావు) గారి రెండవ వర్థంతి సందర్భముగా ఈ పుస్తకం ప్రచురణ జరుగుతోంది. ఆలోచనా పరునిగా మరణాంతరం నేత్రదానం చేసి ఇరువురుకి ఈ ప్రపంచాన్ని చూసే కంటి చూపు ప్రసాదించిన గొప్ప మనిషి శివయ్య.

ఆయన స్మృతిలో తీసుకువస్తున్న ఈ చిన్న పుస్తకం పలు ప్రజాహిత మానవీయ సంస్థల చిరు పరిచయం. యాంత్రికంగా సాగుతున్న సమాజంలో చైతన్యాన్ని స్పృశించే విభిన్న ప్రత్యామ్నాయ ప్రయత్నాల సంగమం. మంచి ఎక్కడున్నా స్వీకరించాలనే సందేశంతో వ్యక్తమయిన సమతా సంవేదనం.



ఈ పుస్తకం మీ చేతుల్లోకి వచ్చిందంటేనే సమాజంకోసం మీ వంతు పాటుపడ్డానికి మీరు సిద్ధమని అర్థం. మెరుగైన పౌర వ్యవస్థకోసం ఎంతోకొంత పని చేయడానికి మీరు బద్ధులై ఉన్నారనేది యదార్థం. అందుకే, రండి, కొత్తతరాలకి కొత్తగా మంచి ఆలోచనల్ని మనం పరిచయం చేద్దాం, పదండి.

**ప్రజా విజ్ఞాన చైతన్య వేదిక – తెనాలి**